# జమీన్ రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకటరామానాయుడుగారు

సంపాదకుడు: నెల్లూరు శ్రీరామమూర్తి

Regd. No. H. NL. 18
స్థాపితం: 1930
సంపుటి: 57 సంచిక: 4
24-1-1986
శుక్రవారం
14 పేజీలు: రూపాయి




# శివశంకర్‌కు మంత్రిత్వం- రాష్ట్రనాయకులలో కలవరం!

కేంద్ర మంత్రివర్గంనుంచి టి. అంజయ్యను తప్పించి శివశంకర్‌ను ప్రధాని రాజీవ్‌గాంధీ తీసుకోవడంతో రాష్ట్ర కాంగ్రెస్ వ్యవహారాలలో జలగం వెంగళరావు, శివశంకర్‌ల ఆధిక్యత మరొకసారి రుజువైనట్లే. అంజయ్య స్థానంలో శివశంకర్‌ను తిరిగి తీసుకోవడం రాష్ట్ర కాంగ్రెస్‌లో పలువురికి విస్మయం కల్గించింది. ఎందుకంటే ఈసారి కేంద్ర మంత్రివర్గ విస్తరణ జరిగితే అంజయ్యను తప్పించి వెంగళరావును తీసుకుంటారని గత కొద్దిరోజులుగా ఇక్కడి రాజకీయ వర్గాలలో ఊహాగానాలు కొనసాగుతున్నాయి. గుజరాత్‌నుంచి రాజ్యసభకు ఎన్నికైన శివశంకర్ మంత్రిపదవి పొందడం ఆశ్చర్యపరిచింది. రాష్ట్రంలో అసెంబ్లీ ఎన్నికలు జరగడానికి, ఇంకా నాలుగేళ్ళ వ్యవధి ఉన్నందువల్ల కేంద్ర మంత్రివర్గంలో చేరాలనే కోర్కె వెంగళరావుకు బలీయంగా ఉండిందని, అయితే ఆయనను పి. సి. సి. నుంచి తప్పించి సమర్థుడిని వెతికి, బాధ్యతను అప్పగించడం కష్టమని ప్రధాని భావించినందువల్ల మంత్రిపదవి చేజారిపోయిందని అంటున్నారు!

శివశంకర్‌కు తిరిగి మంత్రి పదవి లభించడం రాష్ట్ర కాంగ్రెస్‌లోని ప్రత్యర్థి వర్గం ప్రముఖులకు అశనిపాతంగా పరిణమించిందని తెలుస్తున్నది. మార్చిలో జరిగే రాజ్యసభ ఎన్నికల్లో రాష్ట్రం నుంచి సీటు సంపాదించడానికి ప్రయత్నిస్తున్న కొందరు ప్రముఖులు నీరుగారిపోయారు. ఎందుకంటే శివశంకర్ గుజరాత్ నుంచి ఇటీవలే ఎన్నికైనప్పటికీ, ఆయన సభ్యత్వ పదవీకాలం మార్చి వరకే అయినందువల్ల, ఆయనను తిరిగి రాష్ట్రంనుంచి ఎన్నిక చేయించవచ్చునని భయపడుతున్నారు. ఇకపోతే అంజయ్యను మంత్రివర్గంలోనుంచి తప్పించడం కేంద్ర మానవవనరుల శాఖమంత్రి పి. వి. నరసింహారావు, రాష్ట్ర కాంగ్రెస్‌లోని వెంగళరావు వ్యతిరేకులకు ఇష్టం

మా హైదరాబాదు విలేఖరి

లేదు. అయితే అంజయ్య కేంద్రమంత్రిగా పనిచేయడంలో ఘోరంగా వైఫల్యం చెందాడని ప్రధాని ఖరారు చేసుకోవడం ఆయన పదవి పోవడానికి ప్రధాన కారణమని అంటున్నారు. దీనికి తోడు రాష్ట్ర కాంగ్రెస్‌లో తుంపులు పెట్టడానికి దాపకింద నీరులాగా ప్రయత్నించడంకూడా ఆయనకు ఎసరుతెచ్చిందని చెబుతున్నారు. అంజయ్య అనుచరుడైన మాజీమంత్రి పి. జనార్ధనరెడ్డికి నగర కాంగ్రెస్‌కమిటిఅధ్యక్షపదవి ఇచ్చినప్పటికీ ఊరుకోకుండా శ్రీ అంజయ్య శ్రీ వెంగళరావుకు వ్యతిరేకంగా పనిచేయడం ప్రారంభించారని, ఆయన నియమించిన జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులను సంప్రదించకుండా ఆయా జిల్లాలలో ప్రత్యర్థి వర్గం ఏర్పాటుచేసిన సభలకు హాజరైనారన్నఆరోపణలుకూడాఉన్నాయి. దీనిపై వెంగళరావు ప్రధానికి ఫిర్యాదుకూడా చేసినట్లు తెలిసింది. ఇదిలా ఉండగా వెంగళరావువ్యవహారసరళిపట్లఅసంతృప్తి చెందుతున్నవారి సంఖ్య పార్టీలో రోజురోజుకూ హెచ్చుతున్నది. పార్టీలో బలమైన రెడ్డివర్గం ఆయనను గద్దెనుంచి దించి ఎలాగైనా పి. సి. సి. పదవిని పొంది ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెస్‌కు తాము తప్ప మరొకరెవరూదిక్కులేరు అని చెప్పడానికి ప్రయత్నాలు చేస్తున్నారు. పి.సి.సి.(ఐ) మాజీ అధ్యక్షుడు శ్రీ రాజశేఖర్‌రెడ్డి నాయకత్వంలో రాయలసీమ రెడ్లందరూ ఏకమై

—కొరవ 12వ పేజీలో

# బాలచెన్నయ్య 'దిష్టిబొమ్మే'నా?

జిల్లా పరిషత్ ఛైర్మన్ పదవికాంతకు ఇంకా 'ఇద్దరు మొగుళ్ళ' తంటా తప్పిపోలేదు. హైకోర్టుతీర్పు ఉత్తర్వులోని అస్పష్టమైనభాగాలఆధారంగా ప్రభుత్వం ఆడుతున్న ఆట ఇంకా కొనసాగుతూనే వుంది. డి. డి. ఒ. ప్రభుత్వఉత్తర్వులను తుచ తప్పకుండా పాటించడంతో ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి ఇష్టారాజ్యంగా జరిగిపోతూంది జిల్లాపరిషత్ పాలన.

హైకోర్టు తీర్పుపై ప్రభుత్వాన్ని వివరణ కోరింది చిత్తూరు జిల్లా కలెక్టర్ అట. చంద్రబాబునాయుడు అది అవకాశంగా తీసుకుని, నలుగురుఛైర్మన్‌లకూ వర్తించే విధంగా, వివరణ ఇప్పించాడట. దీని ప్రకారం, హైకోర్టు స్టే పొందిన ఛైర్మన్‌లకు కారు, క్యాంప్‌క్లర్కు తప్ప, మరే సౌకర్యము, అధికారమూ వుండదు. వైస్ ఛైర్మన్ సర్వంసహాధికారం చలాయించుకోవచ్చు.

మంత్రిగారి అండవుండడం, అధికారుల వత్తాసు లభించడంతో ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి నాటికి నూరుపాళ్లు అధికారం అనుభవిస్తున్నాడు. అధికారుల దృష్టిలో ఆయనే అసలు ఛైర్మన్. సకలసబ్బందు ఫైళ్ళు ఆయనకే పంపబడుతున్నాయట. ఎడమచేత్తో, కుడిచేత్తో కూడా సంతకాలు గిలికేస్తూ, ఐదులిట గిరటీల ఉత్తర్వులను అప్పటి మున్సడిగా విడుదలచేస్తున్నాడాయన.

రాజకీయంగా అశక్తుడైనందువల్ల కాబోలు, బాలచెన్నయ్య పాపం 'దిష్టిబొమ్మ'గామిగిలిపోయాడు. తీర్పుపై వివరణకోరుతూఆయనహైకోర్టులోఅర్జీ దాఖలు

> జిల్లాపరిషత్‌లో ఇద్దరుమొగుళ్ల కాపురం ఇంకా కొనసాగుతూంది!

చేశాడుకాని, అడ్వొకేట్ జనరల్ లేనందువల్ల 28 తేదికి, విచారణ వాయిదా పడిందట. తిరిగి హైకోర్టు ఉత్తర్వులు వచ్చినంతవరకు, తాము చేయగల్గిందేమీలేదని, ఫైళ్ళనీ ప్రభుత్వ ఆదేశం ప్రకారం వైస్ ఛైర్మన్‌కే పంపుతామని అధికారులు నిస్సహాయత వ్యక్తం చేశారట.

ఇదిట్లావుంటే, 24 తేది స్టాండింగ్ కమిటీ సమావేశాలు జరగవలసివుంది. వీటికి అధికారికంగా అధ్యక్షుడు కలెక్టరు. ఛైర్మన్ సభ్యుడు. ఈ సమావేశానికి మాత్రం, బాలచెన్నయ్యను అనుమతిస్తామని, ఆయనకు ఓటుచేసే అధికారం కూడా వుంటుందని డి డి ఒ చెప్తున్నాడు. అంటే నిత్యపాలనలో ప్రభుత్వ ఆదేశాలను, సమావేశాల నిర్వహణలో హైకోర్టు ఉత్తర్వును అమలుచేసి, ఇద్దరి మెప్పు పొందాలన్నది వారి అభిమతంగా వున్నట్లుంది.

నిజానికి హైకోర్టు తీర్పులోని తొలి రెండుభాగాలప్రకారం, బాలచెన్నయ్యకు సమావేశాలు నిర్వహించడమేకాదు-ఛైర్మన్‌గా అన్నివిధులను నిర్వహించడానికి, అధికారాలు అనుభవించడానికి అవకాశంవుంది. తీర్పులోని తొలివాక్యమే ఛైర్మన్‌గా బాలచెన్నయ్య కొనసాగవచ్చుననివుంది. 3 వ పదరుతోనే వచ్చిన చిక్కంతా. అందులో "ఛైర్మన్ తమ తదుపరి ఉత్తర్వులు జారీ అయ్యేంతవరకు ఎటువంటి విధులూ నిర్వర్తించకూడదని, ఛైర్మన్ అబ్సెంట్ అయితే మాత్రం వైస్‌ఛైర్మన్ అన్ని కార్యకలాపాలూ కొనసాగించవచ్చునని" వుంది. ఈ అస్పష్టతను ఆధారంగా చేసుకునే పక్షంలో, బాలచెన్నయ్యకు ఫైళ్ళు పంపకపోవడమేకాదు, సమావేశాలకు కూడా రానివ్వకూడదు. దానిని విస్మరించే పక్షంలో, అన్నీ ఆయనద్వారానే జరిపించాలి. అంతేతప్ప, ద్వంద్వవైఖరి

—కొరవ 7వ పేజీలో

# జనవాణి

## ఇంత నిర్లక్ష్యమా?

సంక్రాంతి వర్షం ఫలితంగా జిల్లాలో రైతాంగం ఎదుర్కొంటున్న పరిస్థితులను వివరించడానికి దుర్భరము, దయనీయము అన్న పదాలు చాలవేమో? వానవెలిసి పదిరోజులు గడిచాయి: కాని ఇప్పటికి కొన్నికొన్నిచోట్ల పొలాలు మోకాటిలోతునీళ్ళలో మునిగిపోయి వున్నాయి. 1979 నుంచి ఈ ఆరేళ్ళలో నెల్లూరుజిల్లా రైతాంగం ఎదుర్కొన్నన్ని ప్రకృతి విపత్తులు, దేశంలో మరెక్కడా సంభవించి వుండవేమో! ఏడాదిలో సగభాగం కరువుకథలు, మిగిలినభాగం వరదల వెతలతో రైతాంగం బ్రతుకు చివికి చినుగులుపట్టిపోయింది.

అన్నిగండాలుగడిచి, తెల్లవారకైనా పాడిపంటలతో పచ్చగా కళకళలాడుతుందని సంతోషించే సమయంలో ఈ వైపరీత్యం దాపురించింది. ధాన్యసిరులు ఇంటిముంగిట నింపవలసిన సంక్రాంతి, నిండు గర్భిణీస్త్రీలవలె వుండిన పండిన పొలాలను పాడుచేస్తుందని ఎవరు కలగన్నారు? ఏమిటీ ప్రకృతిశాపం? రైతు ఏమిపాపంచేస్తే ఇట్లా పగదీర్చుకుంటూందది?

అర్థశతాబ్ది ఇవతల ఎరుగని కాలవైపరీత్యాన్ని నెల్లూరుజిల్లా రైతాంగం ఎదుర్కొంటుంటే, రాష్ట్ర ప్రభుత్వం పట్టీపట్టనట్లుండడం ఇంకా ఘోరంగావుంది. కోతలు, వేతలు, నురిపిళ్ళతో కరామసిగా వుండవలసిన జిల్లాప్రాంతం నిరామయంగా, నిరాశానిస్పృహలతో నిట్టూరుస్తుంటే, రైతు తన సర్వస్వం జలదేవతకు నైవేద్యంగాపెట్టి దివాలాతీసి కూర్చునివుంటే, ముఖ్యమంత్రినుంచికాని, మరొక ప్రభుత్వ అధినేతనుంచికాని కనీసం ఒక్క సానుభూతి ప్రకటన, ఒక్కటంటేఒక్క వోదార్పుపలుకుకూడా రావటంలేదంటే ఏమనుకోవాలి? నీరోచక్రవర్తి వారసత్వ ఫలితమని సరిపెట్టుకోవాల్నా?

ఎంత నోరులేని మూగజీవి అయినా, ఎంత అసంఘటిత రంగమైనా, రైతాంగంపట్ల ఇంత నిర్లక్ష్యం పనికిరాదు. ప్రభుత్వం తక్షణమే రంగంలోకిదూకి ప్రవాహంలో కొట్టుకపోతున్న రైతుకు చేయూతనిచ్చి, గట్టుకులాగాలి!

మొలగొలుకు రైతును ఇప్పుడు ప్రధానంగా పట్టిపీడిస్తున్న సమస్య- నీళ్ళపాలుకాగా మిగిలిన నాలుగుగింజలను అమ్ముకోవడమెట్లా అన్నదే! వెల్లువను ఎంత తప్పించుకున్నా, ఒకటిరెండు రోజులలోనే తెరిపినపడగల్గిన పైరుకూడా కోసి, నూర్చితే పచ్చగింజ పడడం ఖాయం. వాటిని మిల్లర్లు కొనరు. కొన్నా కూలినీళ్ళ రేటుకడుగుతారు. ఉత్తర కోస్తాజిల్లాలలో గతనెల కురిసిన వర్షాలకు తడిసినధాన్యాన్ని ప్రభుత్వం తానే కొంటానని ప్రకటించింది. ఆ బాధ్యతను రైస్ మిల్లర్స్ ఫెడరేషన్‌కు అప్పగించింది. ఈ ఏర్పాటును నెల్లూరుజిల్లాకుకూడా వర్తింపజేయాలని ఆలోచిస్తున్నట్లున్నారు; కాని అది మనకు వ్యర్థం.

నెల్లూరులో ఫెడరేషన్‌లేదు. వున్నా వేలపుట్లవడ్లు కొనగల్గిన ఆర్థికస్థోమతలేదు. అందువల్ల రైతులు తడిసిన ధాన్యాన్ని పొరుగు రాష్ట్రాలకు యధేచ్ఛగా రవాణాచేసుకోవడానికి ప్రభుత్వం అనుమతించాలి. అన్ని నిర్బంధాలను, నిషేధాలను సడలించాలి.

దానితోపాటు, ఈ ఏడాది తీసుకున్న పంటరుణాలను రద్దుచేసి, కొత్త అప్పులు ఇప్పించాలి. శిస్తులు, గిస్తులు మాఫీచేయాలి. ఆర్థికంగా అణగారిపోతున్న రైతాంగం నిలదొక్కుకోవాలంటే, ప్రభుత్వం ఉదారంగా వ్యవహరించకతప్పదు. మీనమేషాలులెక్కించి, పిసినిగొట్టుతత్వం అవలంబిస్తే, రైతు దిక్కులేనివాడైపోతాడు,



# జమీన్ రైతు

24-1-1936

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**నెల్లూరు ముచ్చట్లు**

నెల్లూరు కాంగ్రెసు భవన నిర్మాణ ప్రయత్నం దాదాపుగా పూర్తి కావచ్చింది. స్థలం కొనుగోలు 1500 రూపాయలుకాగా కాంగ్రెసు వారు ఇచ్చిన రు200లతోచేరి రు 316లు స్థలవిక్రయంతో చెల్లుబడ్డది. ఇక స్థలానికి రు 1200 లు చెల్లితే, బిల్డింగు మొత్తం చేకూరితే ఇస్తినవారి కోటి రూపాయల నిధిమాదిరి పరిణమిస్తుందన్నమాట. కార్యనిర్వాహకుల దురుసుదనం మునిసిపాలిటీ చల్లబడింది.

* * *

ఎలక్షన దరవాజాలు తెరవబడ్డాయి వైకుంఠ వాకిళ్ళతోకూడా! ఖాన్ బహదర్ వారు 12 తేది మునిసిపల్ కౌన్సిలర్ యునాని డాక్టరు ప్రభృతులతో ఎలక్షన్ చైత్ర యాత్ర సాగించారు. అనంతసాగరం, కరటంపాడు వగైరా గ్రామాలకు. మునిసిపల్ డాక్టరు వారు ఉరుదులో ఉపన్యసించడం, మునిసిపల్ కౌన్సిలరు తర్జుమా చేయడం, మునిసిపల్ అర్థములు అనందించడం, జాగానేవుంది.

* * *

కానిడబ్బులు ప్రజాకార్యాలకు ఖర్చుపెట్టడానికిసాహసించని మైజరు చక్రవర్తులంతా ఎన్నికలొచ్చాయంటే ఏమిదానధర్మాలు? ఏమి ప్రజాకార్య నిర్వహణ దీక్షాపరతంత్రాలు? ఏమి చెప్పాలె వీరి త్యాగ మహిమలు.

* * *

అనంతసాగరంవారి మసీదుకూడా రు 200 లు ఎలెక్షన పారితోషికాన్ని అల్లాకు ప్రీత్యర్థంగా గ్రహించి మక్కా, మదినా అంతటి తీర్థయాత్రాస్థలంమాదిరి పుణ్యపీఠమైంది. ప్రతి సంవత్సరం ఈలాంటి ఎలక్షనలే రావాలని మౌల్వీలంతా ఆశీర్వదం చేశారట 12 తేదివాడు.

**గాడిదలరచి కాపురాలు తేపాయి**

నెల్లూరులో పోలీసు సూపరెంటుగారి బంగళా దగ్గరమిట్టన వుంది. దానికి సమీపంలో ఎరుకలవారికుటుంబాలుసుమారు 25 కాపురాలున్నవి. వీరు 25 సంవత్సరాలుగా కాపురా లుంటున్నారు.

15 తేది రాత్రి హిందూదేశంలోని కొన్నిగాడిదలు సూపరెంటుగారి బంగళాలో దూరి తోట పాడుచేసి అరిచాయట. ఆ కారణంతో 16 తేది ప్రొద్దున్నే పోలీసులు ఈ ప్రక్కనున్న కాపురాలమీదబడి 25 కుటుంబాలను లేవదీశారు....

**నెల్లూరు వార్తలు**

నెల్లూరు కొలరా 17 తేది వరకు కలరా 12 మందికి సోకి, 12 మంది చచ్చిరనియు, 20 తేది వరకు 7 మందికి తగిలి ఒకరు మాత్రము చచ్చిరనియు, కలరా పెద్దలా చికిత్స యేమాత్రము బాగుతేదనియు సీలం సుబ్బరాయుడుగారు తెలుపుచున్నారు.

**నెల్లూరులో ట్రంకు టెలిఫోను**

ట్రంకు టెలిఫోను మార్చినెం మొదలు నెల్లూరుతో వలయువారందరికి ఇండ్లలో అమర్చబడునట. స్టేట్ బిజినెస్ హెచ్చుగా నున్నందున, మద్రాసు నుండి కుమరా రాజా సాహెబ్ గారితో నిరంతరము వ్యవహరించుటకు వేదాంతాచారిగారు ప్రథమమున వారింటికి అమర్చెదరట.★

# స్వర్ణముఖి గండ్లు పూడ్చకుంటే రైతులు వలస పోవలసిందే!

తిన్నెలపూడి వద్ద, స్వర్ణముఖి పొర్లుకట్టకు పడుతున్న గండ్లు, అనేక గ్రామాలలో అసంఖ్యాకమైన పంటపొలాలను ఇసుక తిన్నెలుగా మారుస్తున్నాయి. రైతులపాలిట, ప్రకృతి శాపాలుగా మారుస్తున్నాయి.

1983 లో స్వర్ణముఖికి పొర్లుకట్ట వేశారు. 1984 లో తిన్నెలపూడి దగ్గర దీనికి బండ్లబాట పెట్టారు. అప్పుడొచ్చిన వరదలకు ఇక్కడే గండిపడింది. ఫలితంగా రంగనగుంట, తూపిలిపాళెం, వంజివాక, మొలగనూరు తదితర రోడ్లు, కొన్ని చెరువులు తెగాయి. వందలాది ఎకరాల పంటను వరద ముంచిపారేసింది. 85 అక్టోబరులో దీనికి మరమ్మత్తు జరిగింది.

అయితే 86 లో మళ్ళీ ఇదేచోట గండిపడింది. యరగాటిపల్లె, మొలగనూరు తదితర చెరువులు తెగాయి. మళ్లీ లక్షలు ఖర్చుపెట్టి పూడ్చారు. 85 డిసెంబరు 14 తేది మళ్లీ అక్కడే గండిపడింది; పంటలను ముంచింది. మళ్లీ ఈ నెల 14 తేది మరొకసారి ఏరు పొర్లింది. మొత్తం ఊడ్చిపెట్టుకొని పోయింది.

ఈ నాలుగేళ్ళలో రైతుకు జరిగిన నష్టం ఎంతో ఎవరూ అంచనావేయలేరు. ఆఫ్టరాల్ ఒక చిన్నగండి పూడ్చలేక




పోతున్న పి. డబ్ల్యు. డి. అధికారులనేమనాలి! ఈ గండిని గట్టిగా పూడ్చలేకుంటే, ఇక చుట్టుప్రక్కల గ్రామాలలో రైతులు సేద్యం మానుకొని వలసపోవలసిందే! ఇప్పటికైనా రైతుకష్టం గుర్తించి సరైన చర్యలు తీసుకోండి.

మొలగనూరు -తి. వెంకటకృష్ణారెడ్డి,

## అన్నకు సినిమా పిచ్చి వదలదేం!

ఒక అమరప్రేమికుడి హృదయ ఔన్నత్యానికి ప్రతీకగా, కఠిన శిలలను పజీవశిల్పాలుగా మలచే చాతుర్యంగల అద్వితీయ కళాకారుల అనద్భుత కృషికి నిదర్శనంగా వెలిసిన తాజ్‌మహల్‌ను, సిమెంటు, ఇసుక పైపైనపూసి ఉపరదాపరగాకట్టిన 'తెలుగు లలితా తోరణం'తో పోల్చడం, గుర్రానికి గాడిదకు తేడా తెలుసుకోలేకపోవడమే. అన్నగారు ఈ పోలికతెచ్చి, తాజ్‌మహల్‌నే అవమానించారు.

అసలు, ముఖ్యమంత్రి అయి మూడేళ్ళు గడచినా అన్నగారు ఇంకా సినిమా డైలాగులు వదలలేక పోవడం, చౌకబారు సినా దాలకు ప్రాకులాడడం ఎందుకు? కురుసార్వభౌముని రంకెలు, మాతకుల సంజాతుని కేకలు, కృష్ణ పరమాత్ముని చిరునగవులు ఇంకా ఆయన నుంచి మాసిపోలేదు. ఇంగువ లేకపోయినా గుర్తువాసన ఇంకా తొలగలేదు. రామారావుగారు ముఖ్యమంత్రిత్వం నెరపినట్టులేదు.

-కొరవ 11వ పేజీలో

# రైలుపట్టాలు పెరికిన నెల్లూరు పెద్దకరణం

నెల్లూరు జ్ఞాపకాల శీర్షికతో ప్రొఫెసర్ కందాడి శేషాద్రి వ్రాస్తా వించిన పలు సంఘటనలు హృద్యంగా వున్నాయి; పూర్వీకులను జ్ఞప్తికి తెచ్చాయి. కొండపూడి ఆదిశేషారెడ్డి గురించి రాసిన వాక్యములు ఇంకా అద్భుతంగా వున్నాయి. రెండు దమ్మిడీలకు కలెక్టర్ కుర్చీని వేలం వేయించినాడంటే మాటలా?

ఈ సందర్భంగా ఇంకొక ప్రధాన సంఘటన స్ఫురణకు వస్తూంది. బ్రిటిషు హయాంలో నెల్లూరుకు పెద్ద కరణంగా పెగ్గా[illegible] వెంకటమణయ్య వుండేవారు. ఒకసారి, అయనకు ముఖ్యస్నేహితుడైన ఒక డిప్యూటీ కలెక్టరును, రైలులో ఫస్ట్‌క్లాస్ సెకండ్‌క్లాస్ తారతమ్యంలో

## మేము-మీరు

కొందరు బ్రిటీషు ఉద్యోగులు అవమానించారట.

ఇది తెలిసిన వెంకటరమణయ్య ఆనంగలు ఎత్తి చూశాడట. పొగబండి పట్టాలు, తెవిస్కా పొలాంలో రెండు మైళ్ళు పోతుండినాయట. రెండు దమ్మిడీల చొప్పున రెండుమూడేళ్ళకు రైలు కంపెనీ శిస్తు బాకీ పడివుండిందట. వెంటనే కరణం, ఆ మేరకు రైలుపట్టాలు పెరికించివేశాడట. ఎక్కడి రైళ్లు అక్కడే ఆగిపోయాయి.

తర్వాత కలెక్టరు జోక్యం చేసుకొని విషయం విచారించి, రైల్వే ఉద్యోగులనే దివాళ్లు పెట్టి రమణయ్యకు సర్దిచెప్పి, పట్టాలు వేయించాడట. అంతటి ఘను లుండినారు ఆరోజుల్లో! మరి ఇప్పుడో?

నెల్లూరు -కె. వి. బాలసుబ్బారెడ్డి

# కంపరాయల స్మారకంగా కంపసముద్రం ఏర్పడిందా?

మన చిత్రగావచ్చి గ్రామ కంపసముద్రం ఒకటి. ఈగ్రామం ఉదయగిరి-వెక్కెలు మార్గంలో అటవి ప్రాంతంలోవుంది.

క్రీ. శ. 1343 నాటికి విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించిన హరిహర రాయలు సోదరుడగు కంపరాయలు తూర్పుతీర సముద్రంవరకు జయించి, ఉదయగిరిని రాజధానిగాచేసి ఉదయగిరి రాజ్యాన్ని విజయనగర సామ్రాజ్యంలో కలిపాడు

ఈ ఉదయగిరి రాజ్యంలో మన నెల్లూరు మండలమేకాక, కడప, కర్నూలు ప్రకాశం మండలాలలో కొంతభాగంకూడా కలిసివుండెను. ఆత్మకూరు తాలూకా

—కొరవ 10వ పేజీలో

## ఊరు-పేరు

ఇక్కడ చెప్పుకోగిన పెద్దచెరువులేదు. అంకువల్ల చెరువు వుండడంవల్ల ఈ గ్రామానికి ఈ పేరు వచ్చియుండుట తగనిపని.



# ప్రకృతి శాపంనుంచి రైతును పంట భీమా రక్షిస్తుందా?

ప్రకృతి కన్నెర్రజేసి నిస్సహాయంగా బతికి, మొలమల మాడిపోవడం తప్ప, ఎప్పుడూ ఎవరి చేయూత అందుకోలేని రైతాంగానికి, కేంద్రప్రభుత్వం గత ఏడాది ప్రవేశపెట్టిన 'పంట భీమా' పథకం వరప్రసాదిని కానున్నది. సంక్రాంతి కుంభవృష్టికి నీటిపాలైన మొలగొలుకు రైతు బ్రతుకును, భీమాద్వారా దరిచేర్చడానికి అధికారులు సన్నాహాలు ప్రారంభించారు. అయితే ఈ పథకం వరదలో కొట్టుకుపోయేవాడికి గడ్డిపోచ సాయమే తప్ప, చేతికందిన తెప్పగాసహకరించదు.

పంట భీమా పథకం ప్రవేశపెట్టిన తర్వాత, దానిని ఉపయోగపెట్టుకో గల్గుతున్న జిల్లాలలో బహుశా నెల్లూరు మొదట వస్తుందేమో ! ప్రధానిగా రాజీవ్ రైతాంగానికి చేసిన పెద్ద ఉపకారం ఇది.

ఈ పథకం ప్రకారం బ్యాంకులలో పంట అప్పులు తీసుకున్న ప్రతిరైతుకూ భీమాసౌకర్యం వర్తిస్తుంది. అసలు తాము భీమా ప్రీమియం కట్టినట్లుకూడా చాలా మంది రైతులకు తెలియదు. బ్యాంకులలో వారి ఖాతాలలో వారికి తెలియకుండానే ప్రీమియం మొత్తం జమచేసిన సార్భ్యాలు కూడా వున్నాయి. అంతేకాదు. ఈ భీమాక్రింద నష్టపరిహారం ఎట్లాచెల్లించాలో, ఎంతెంత చెల్లించాలోకూడా అధికారులకు స్పష్టంగా తెలిసినట్లులేదు. అత్తగారింట్లో కొత్తకోడలిలా తపుడులాడుతున్నారు అధికారులు.

సృష్టాతిసృష్టంగా తెలిసిన వివరాలను బట్టి నష్టపరిహారం, సగటు ఉత్పత్తిని ఆధారం చేసుకుని చెల్లిస్తారట. ఇందుకు మండలం ఒక యూనిట్.

హైదరాబాదులోని బ్యూరో ఆఫ్ ఎకనమిక్స్ అనే సంస్థ నష్టాన్ని మదింపుచేసే కార్యక్రమం చేపట్టింది. వీరు ప్రతి మండలంలో కొన్నిప్లాట్లను శాంపిల్‌గా ఎంపిక చేస్తారట. వాటిలో ఇప్పుడు ఎంత దిగుబడి వచ్చింది అన్నది తెలుసుకుంటారు. వారిదగ్గర గత ఐదు సంవత్సరాల పంట దిగుబడుల లెక్కలు వున్నాయట. అవి ఎవరెవరిద్వారా సేకరించారో తెలియదు. వాటిలో ప్రతిఏటా ఆయా మండలాలలో సగటు పంట దిగుబడి, సాధారణ దిగుబడి, అత్యధిక దిగుబడి, అత్యల్ప దిగుబడి తదితర లెక్కలుంటాయి.

రైతు శోకం

ఇప్పుడు వీరు ఎంపికచేసిన శాంపిల్ ప్లాట్లలో వచ్చిన దిగుబడిని, ఈ లెక్కలనుపోల్చి, దానిప్రకారం తమారమి నష్టం అంచనావేస్తారు. దాని ప్రకారం అందరికీ నష్టపరిహారం చెల్లిస్తారు.

ఈ విధానంలో చాలా లోపాలున్నాయి. ఏఏ మండలాలలో ఏఏ ప్లాట్లను నష్టపరిహారం అందనాకు తీసుకోవాలో నాలుగునెలలక్రితమే ఎంపిక చేశారట. అవి ఏవైంది అధికారులకొక్కరికే తెలుసు. ఇప్పుడు ఆ ప్లాటలో ఎంత నష్టంజరిగితే అందరికీ అంతే; నష్టం లేకుంటే అందరికనీ గోవిందే.

ఇంకా విశేషమేమిటంటే నష్టపడని రైతులకుకూడా, దీనివల్ల లాభం కలుగుతుంది. నష్టం ఎక్కువ జరిగిన వాడికీ, జరగనివాడికీ, కొద్దిగానే జరిగినవాడికీ కూడా సమానంగా పరిహారం లభిస్తుంది.

నెల్లూరు జిల్లా వరకు చూస్తే ఇందుకూరుపేట, కోవూరు, నెల్లూరు తదితర తాలూకాలలో పూర్తిస్థాయి నష్టం జరిగింది. అయితే, కొన్ని గ్రామాలలో కొన్ని పొలాలకు నష్టం లేకుండానో, లేక తక్కువగానో వున్నాయి. అధికారులు ఎంపికచేసిన శాంపిల్ ప్లాట్లు వాటిలో గనుక వుంటే, రైతాంగం

....కొరవ 11 వ పేజీలో

# 'వానర సైన్యమే' నన్పించారు యూత్ కాంగ్రెస్ కార్యకర్తలు!

హనుమంతరావు రాష్ట్ర యూత్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా వున్నప్పుడుకాబోలు అప్పటికి ప్రధానిగూడాకాని రాజీవ్ గాంధీకి బేగంపేట విమానాశ్రయంలో స్వాగతంచెప్పడానికి ఎదురేగితే, ఎట్లావుంది నీ 'వానరసైన్యం' అని పరామర్శించాడట రాజీవ్‌గాంధీ! యూత్ కాంగ్రెసకు తెలిసో, తెలియకో, పరాచకానికో ఆయన ఇచ్చిన నిర్వచనాన్ని నిజంచేసి చూపించారు నెల్లూరు కాంగ్రెసు యువకులు.

20 తేది ఉదయం, జిల్లా యూత్ కాంగ్రెస్ అధ్యక్షతకు అభ్యర్థిని ఎంపికచేయడానికి, రాష్ట్ర అధ్యక్షుడు శ్రీ వాలిన సూర్యభాస్కరరావు నెల్లూరువస్తే కాంగ్రెస్ యువకిశోరాలు ప్రవర్తించిన తీరుచూస్తుంటే, కాంగ్రెసుకు ఇక ఈ రాష్ట్రంలో భవిష్యత్ అనేది వుంటుందా అని సందేహం కల్గుతూంది.

ఈ మహాపెద్దపదవికి, ముగ్గురు అభ్యర్థులు తయారైనారట. కె. వి. సుబ్బా సుబ్బారెడ్డిగారు, తన అల్లుడు శ్రీ విజయశేఖరరెడ్డిని ప్రతిపాదించారు; సి. వి. శేషారెడ్డి అభ్యర్థిగాకాబోలు, శ్రీ మెట్టా చంద్రశేఖరరెడ్డి రంగంలోకి వచ్చారు; కాంగ్రెస్‌లో ఏపదవికి ఖాళీ ఏర్పడినా అది తనకేకావాలనే ఎన్. ఎస్. యు. ఐ విజయకుమారరెడ్డికూడా తయారు. వీరికి రైల్వేస్టేషనులోనే లడాయి ఏర్పడిందట. చంద్రశేఖరరెడ్డి ఏర్పాటుచేసిన కారులో, భాస్కరరావు ఎక్కినందుకు విజయకుమారరెడ్డి అలిగి, అగంచేశాడట!

తర్వాత అభిప్రాయ సేకరణ ప్రహసనం నడిచింది, కాంగ్రెస్ భవనంలో! అక్కడా ఇతడికి, మెట్టా చంద్రశేఖరరెడ్డి మద్దతుదారులకు వాగ్వివాదం ఏర్పడిందట. అదిచేతులు కలుపుకొనేదాకా పోయి క్రయిమాక్స్‌గా పలుగులు, పారలు ఎత్తుకున్నారట. ఇద్దరు క్షతగాత్రులయ్యారు కూడా! రాష్ట్ర అధ్యక్షుడు అసలే శారీరకంగా చాలా బలహీనంగా వున్నాడు. ఆయన ఈ రచ్చ భరించలేక ఎంపిక, గింపిక హైదరాబాదులోనే చేస్తానని ప్రకటించి, కాలెక్కితుర్రుమన్నాడట. తర్వాత పత్రికలవారడిగినా ఆయనపేరు చెప్పలేదు.

అధికారంలోలేక, ప్రజలలో అభిమానంలేక శిథిలమైపోయివున్న కాంగ్రెసు పార్టీకి ఇప్పుడు కావలసింది ఇటువంటి దుందుడుకు నాయకులుకాదు- కష్టించి పనిచేయగల్గిన కార్యకర్తలు.

## నెల్లూరు సంగతులు

### పంచాయతీరాజ్ డిప్లొమా ఇంజనీర్ల సంఘం

ఆం. ప్ర. పంచాయతీరాజ్ డిప్లొమా ఇంజనీర్ల సంఘం జిల్లాశాఖకు కొత్త కార్యవర్గం ఎంపికైంది. అధ్యక్షుడుగా ఎస్. గౌస్‌బాషా (బుచ్చి), కార్యదర్శిగా జి. నాగేశ్వరరావు (ఇందుకూరుపేట), కోశాధికారిగా పి. తారకరామరెడ్డి (గూడూరు), ఆడిటర్‌గా ఎం. నాగేశ్వరరావు (వెంకటాచలం), ఉపాధ్యక్షులుగా డి. రామసింగ్, పి. జి. శంకర ప్రసాద్, కె. గోపీకృష్ణ: కార్యవర్గ సభ్యులుగా ఎ. వి. నరసింహరావు, కె. పిచ్చయ్య, ఇ. పెంచలురెడ్డి, ఆర్. సుబ్బులాలా, వి. రాధాకృష్ణయ్య, ఎల్. వి. రమణయ్య ఎంపికైనారు.

### ఇనుప వ్యాపారులు

నెల్లూరుటౌను ఐరన హార్డ్‌వేర్ అండ్ పెయింట్స్ మర్చంట్స్ సంఘానికి ఎం. వెంకటేశ్వర్లు అధ్యక్షుడుగా, కె. గోవిందరావు ఉపాధ్యక్షుడుగా, ఆర్. వెంకటేశ్వర్లు కార్యదర్శిగా, ఇ. గోవిందరావు ఉపకార్యదర్శిగా ఎన్నికయ్యారు.

### పాటల పోటీలు

ఘంటసాల వర్ధంతి సందర్భంగా ఫిబ్రవరి 11 తేది నెల్లూరులో రాష్ట్రస్థాయి పాటలపోటీలు జరుపుతున్నారు- ఘంట

—కొరవ 11 వ పేజీలో

# గ్రామీణ క్రాంతి పథకానికి జిల్లాలో 5 కోట్లు వెచ్చిస్తారు!

పరిపాలనా ఆంధ్రప్రదేశ్ నందువల్ల కాదేమో, అన్నగారికి ఆరంభశూరత్వం అధికం. అనుకున్నదే తడవు, ఎంత ఆలోచించిన పథకమైనా ఆరంభించి తీరాల్సిందే. శ్రమాదమాదుల యోచన కాని, వ్యయప్రయాసల అంచనాకాని వుండవు. ప్రారంభమైన పదినాళ్ళ తర్వాత ఆ పథకం ఏగతిపట్టినా పట్టించుకునేవా రుండరు. తెలుగు చిరంజీవి సుభిక్ష, తెలుగు క్షీరసాగరం, తెలుగు శ్రమదానం, తెలుగు అన్నాతులు, తెలుగు మరుగు దొడ్లు, తెలుగు రిక్షాలు.... వంటి అనంత భూకర పథకాలవలె, 23 తేదీ ఉదయం తెలుగు గ్రామీణ క్రాంతి పథకంకూడా రాష్ట్రంలో మనజిల్లాలో అట్టహాసంగా, ఆడంబరంగా ప్రారంభమైంది.

రెవిన్యూమంత్రి శ్రీ నల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డి కోవూరు నియోజకవర్గంలోని నాలుగు గ్రామాలలో ఈ పథకానికి తొలి రాయి పెట్టారు. ఇతర నియోజకవర్గాలలో కూడా ఎమ్మెల్యేలు, సమితి అధ్యక్షులు ఆ పుణ్యం కట్టుకున్నారు. మంత్రిగారు ప్రారంభించిన కార్యక్రమాలివీ-కోవూరు, యల్లాయపాళెం రోడ్డు; కోవూరు గాంధీ నగర్‌లో ఎలిమెంటరీ స్కూలు భవనం; గండవరంలో బస్ షెల్టర్; పార్వత స్కూలుకు ప్రహరీగోడ. కలెక్టర్ శ్రీ జన్నత్‌హుసేన్, ఎస్. పి. శ్రీ ఆర్. ఆర్. గిరీష్‌కుమార్ తదితర అధికారులుకూడా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. మంత్రి గారి ప్రసంగాలలో విశేషాలేవీలేవు- ప్రకృతి వైపరీత్యాలనుంచి రక్షణ పొందడానికి రైతులందరూ పంటభీమా చేసుకోవాలని ఉద్బోధించారాయన. అంతే తప్ప, ప్రస్తుతం రైతులెదుర్కొంటున్న దారుణ అతివృష్టి బాధలనుంచి ప్రభుత్వపరంగా ఏమి సాయం చేయనున్నది మాత్రం చెప్పలేదు. ఏదైనా చేయబోతుంటేకదా చెప్పడానికి ఉంటారా- అట్లయితే తప్పకుండా వెంటబెట్టుకుంటాం.

## జిల్లావార్తలు

ఈ పథకం వివరాలుచూస్తే, జిల్లాలో మొత్తం 1207 పనులను 5 కోట్లా 36 లక్షల ఖర్చుతో చేపట్టబోతున్నారట. ఇందులో పంచాయతీరాజ్ క్రింద రోడ్లకు 674 పనులు, 2 కోట్ల 74 లక్షలా 80 వేలు; చిన్న నీటిపనరులక్రింద 84 పనులు, 38.77 లక్షలు; స్కూళ్ళకు 45 పనులు 20.04 లక్షలు; ఇతర భవనాలకు 121 పనులు 49.35 లక్షలు; ఇతరత్రా 345 పనులకు కోటి 14 లక్షలు వెచ్చిస్తారట.

ఇర్రిగేషన్ విభాగంలో 64 పనులను 38.82 లక్షలతో చేపట్టాలని తలపెట్టారు. వీటన్నింటినీ జూన్ నెలాఖరుకు పూర్తిచేయాలన్నది లక్ష్యమట.

అపశకునం పలకాలని మాకేమీ లేదు కాని, సాధారణ కార్యక్రమాల నిర్వహణకే రాష్ట్రఖజానాలో కానీడబ్బులులేవు. ఇక వీటికి ఇన్ని కోట్లు ఎక్కడనుంచి క్రుమ్మరిస్తారు? ఎప్పటికి తెస్తారు? అసలు ఈ పథకం ఆచరణకుదిగితే పలు సమస్యలు, ఆటంకాలు ఎదురౌతాయని, వివరాలు వింటేనే తెలుస్తూంది. వాటిని ఎదుర్కొని పథకం నడపడం సాధ్యమా అనేది ఇంకా పెద్దప్రశ్న. ఈ దశలో మనమెందుకు నిరుత్సాహపరచాలి- 3 నెలలుతాళి పరిశీలిద్దాం, గ్రామీణ క్రాంతి పథకం మనగ్రామాలకు ఎంత 'క్రాంతి'ని తెచ్చిపెట్టాయో!

### 'మాల' అన్నందుకు శిక్ష

హరిజనులను కులంపేరుతో తిట్టి, అవమానపరచినందుకు గూడూరు తాలూకా విందూరు సర్పంచ్ శ్రీ పూడిపర్తి సుబ్బరామిరెడ్డికి, గూడూరు ఫస్ట్‌క్లాస్‌మేజిస్ట్రేట్ శ్రీ హరిసాయిబాబా నెలరోజుల ఖైదు విధించారు. సుబ్బరామరెడ్డి తమను తిట్టాడని గ్రామ హరిజనులు ఇచ్చిన ఫిర్యాదుపై ఈ కేసు విచారణ జరిగింది. ఈ కేసులో ప్రాసిక్యూషన్ పక్షంగా అడిషనల్ పి పి శ్రీ సుబ్రహ్మణ్యం, డిఫెన్సు తరఫున శ్రీ కట్టా సుబ్బారెడ్డి వాదించారు.

### జిల్లాలో కొత్త హాస్టళ్లు

జిల్లాలో కొత్తగా ఆరు హరిజన బాలుర హాస్టళ్ళు ప్రారంభించడానికి ప్రభుత్వం అనుమతించిందని రెవిన్యూమంత్రి శ్రీ నల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డి తెలియజేస్తున్నారు. హాస్టళ్లు తెరిచే గ్రామాల పేర్లివి- దామానెల్లూరు (సూళ్ళూరుపేట సమితి) అయ్యవారిపాళెం (గూడూరు) పెనుబల్లి (బుచ్చి) మర్రిపాడు (బుచ్చి) చిల్లకూరు (గూడూరు) తెల్లపాడు (వింజమూరు.)

★ 'మాల' అంటే శిక్ష

★ ఆరు కొత్త హాస్టళ్లు

★ గూడూరు ఇళ్ల పన్ను- హైకోర్టు మధ్యస్తం తీర్పు

★ హరిజనుల ఇళ్లు ఖాళీ- వాసిలి లబోదిబో

### గూడూరు ఇళ్ళపన్నుల సమస్యపై హైకోర్టు తీర్పు

గూడూరు మునిసిపాలిటీలో ఇటీవల జరిగిన ఇంటిపన్ను రివిజన్ వివరణ లేకుండా జరిగింది. నూరునుంచి 1500 శాతంవరకు అదనంగా పన్నులు పెంచారని అలజడిరేగింది, మునిసిపల్ అధికారులను ఇదేమని అడిగితే, 15 సంవత్సరాలనుంచి పాతపన్నులే కట్టినందుకు ఇది శిక్షగా అనుభవించండి అని సమాధానమిచ్చారట. ఎక్కువ చేయడానికి అభ్యంతరంలేదు- క్షమించి చేసిన అన్యాయాలైనా సరిదిద్దండి అని మొత్తుకున్నా ఫలితం కన్పించలేదట, విధిలేని పరిస్థితులలో గూడూరు రేట్ పేయర్స్ అసోసియేషన్ హైకోర్టును శరణువేడింది. కోర్టు, పాతపన్ను, పెంచినదానిలో సగం కలిపి కట్టాలని, అదికూడా అధికమేనని భావిస్తే, అప్పీలు చేసుకోవచ్చునని తీర్పుచెప్పింది.

### వాసిలి పేదల ఇళ్లు ఖాళీ

ఆత్మకూరు తాలూకా వాసిలిలో 1983 లో 115 మందికి కలెక్టరు ఇళ్ల స్థలాలు పట్టాలు పంచారు. అందులో 80 మంది వరకు ఇళ్ళు కట్టుకుని కాపురాలు చేస్తున్నారు. అయితే ఆ స్థలం కల్గిన రైతులు హైకోర్టుకు పోవడంతో, స్థలం వారికి స్వాధీనం చేయమని రెవిన్యూ అధికారులను కోర్టు ఆదేశించిందట. ఇప్పుడీ పేదలు ఇళ్ళు ఖాళీచేసి పోవలసివస్తూంది. రెండేళ్ళు కాపురాలు చేసిన ఇళ్ళు ఖాళీచేసి ఇప్పుడు ఏరెక్కడికి వలసపోవాలి? ప్రభుత్వం వేరేస్థలం చూపిస్తుందా? చూపించినా ఇళ్ళు ఎవరు కట్టించి ఇస్తారు! పాపమా పేదలు లబలబలాడుతున్నారు. ఈ సమస్యను కలెక్టరే పరిష్కరించాలని వారికోర్కె.

కనుపర్తిపాడులో సర్కార్స్ మైక్రో ఎలక్ట్రానిక్స్ ఫ్యాక్టరీని ప్రారంభిస్తున్న కేంద్ర ప్లానింగ్ కమిషన్ సభ్యుడు అబిద్‌హుసేన్, పి. భాస్కరరెడ్డి, ఎమ్మెల్యే కె. వి. సుబ్బారెడ్డి, సర్పంచ్ టి. వి. రమణారెడ్డి.

### ఆత్మకూరు బ్యాంక్

ఆత్మకూరులోని స్టేట్ బ్యాంక్ వ్యవసాయ విభాగంశాఖ 9 వ వార్షికోత్సవం 7 తేది జరిగింది. డి. ఎస్. పి. శ్రీ ఎ. వెంకటేశ్వరరావు అధ్యక్షించారు. భూసేకరణ స్పెషల్ డిప్యూటీకలెక్టర్ శ్రీ ఎస్. గణేశన్, డాక్టర్ జి. సి. నారాయణ, బ్రాంచి అధికారి శ్రీ టి. మోహనరావు తదితరులుమాట్లాడారు. మేనేజర్ శ్రీ ఆర్. కోటేశ్వరరావు నివేదిక చదివారు. ఫీల్డ్ ఆఫీసర్ శ్రీ మహమ్మద్ ఆదంసాహెబ్ వందనాలు చెప్పారు.

—కొరవ రిప పేటరా

# నెల్లూరు కబుర్లు
## విమర్శకుడు

### యూత్ కాంగ్రెస్‌కు కొత్త అధ్యక్షుడు

యూత్ కాంగ్రెస్ కమిటీకి కొత్త అధ్యక్షుడుగా శ్రీ నెల్లూరు చంద్రశేఖరరెడ్డిని నియమించారు. రాష్ట్ర అధ్యక్షుడు శ్రీ వారిన సూర్యనారాయణరావు, నెల్లూరులో విషయం చెప్పి తనను రమ్మన్నారట. హైదరాబాదుకు వెళ్ళి వచ్చినారు.

చంద్రశేఖరరెడ్డి వివాదరహితుడు; వ్యక్తిగతంగా ఎవరూ వేలెత్తి చూపలేరు. "మర్రి" శిష్యుడు. ఆయనకు జనార్దనరెడ్డి ఆశీర్వాదం లభించినట్లుంది. నెల్లూరులో సామూహికంగా ఆయన యూత్ కాంగ్రెస్‌ను ఆయన ప్రజలకు ప్రతిష్ఠాత్మకమైన సంస్థగా రూపొందించాలి.

### ఇందుకూరుపేట తాసిల్దార్ సస్పెన్షన్?

ఇందుకూరుపేట తాసిల్దారు శ్రీ నరసింహారావును సస్పెండ్ చేయనున్నట్లు తెలిసింది. భగత్‌సింగ్ నగర్‌లో పాత ఇళ్ళ స్థలాల స్థానే అక్రమంగా కొత్త పట్టాలు జారీచేశారనే ఆరోపణలపై ఈ చర్య తీసుకోనున్నట్లు తెలుస్తున్నది. ఈవిషయమై ఆర్. డి. ఒ. జాయింట్ కలెక్టరు విచారణజరిపి ఇటీవలే నివేదిక సమర్పించారు.

ఆయితే ఈనేరంలో భాగస్వామ్యమైన ఇతర రెవిన్యూ ఉద్యోగులపైకూడా చర్యతీసుకో నున్నారా, లేదా అన్న విషయం తెలియ రాలేదు.

### దొంగపట్టాల కేసు మాఫీకి యత్నం?

ఎస్. పి., ఆయన సిబ్బంది అత్యంత దాక్షిణ్యంతో వెలికి తీసిన దొంగపట్టాల తయారీ ముఠాను రక్షించేందుకు, పెద్దఎత్తునే ప్రయత్నం జరుగుతున్నట్లు తెలుస్తోంది. ఈ ముఠాలో కీలక వ్యక్తి అనదగిన బుర్రా శ్రీనివాసులురెడ్డి రెవిన్యూ మంత్రికి దగ్గర బంధువట. ఆ 'పలుకుబడి'తో కేసును నీరు గార్చడానికి కనీసం ఆయన వరకు నిర్దోషిగా తేల్చడానికి యత్నాలు జరుగుతున్నాయట. ఎంతవరకు నిజమో మరి!

### రెడ్‌క్రాస్ వ్యాన్ చోరీ

కలెక్టరాఫీసులో నిలిపివుంచిన ఒక రెడ్‌క్రాస్ వ్యాన్ (టి ఎం ఎఫ్ 7984) ను ఎవరో నేర్పుగా తస్కరించారని తెలిసింది.

ఈ వ్యాన్‌కు తాళంవేసి, ఆఫీసు ఆవరణంలో నిలిపి, డ్రైవరును మరొక వ్యాన్ తోలడానికి పంపించారట. 23 తేది ఉదయం 9-30 గంటలకు నలుగురువ్యక్తులు తామే యజమానులమన్నంత దర్జాగావచ్చి, అందరూచూస్తుండగానే స్టార్టుచేసుకొని, ఉడాయించారట. సాయంత్రానికికాని కలదెలుసుకోలేక పోయారు అధికారులు. అప్పుడు హడావుడిగా పోలీసులకు ఫిర్యాదుచేశారట. ఈ వ్యాన్ విలువ 5 లక్షలు.

### నిర్మలపై దాడి

నిర్మల రెస్టారెంట్‌లో టీ, దోసె ప్రభుత్వం నిర్ణయించిన ధరలకంటే ఎక్కువ అమ్ముతున్నారట; విజిలెన్సు డి. ఎస్. పి. ఇటీవల హోటల్‌పై దాడి చేసి, యజమాని శ్రీ అయ్యల్‌రెడ్డిని అరెస్టుచేశారు.

ప్రభుత్వం తాను నిర్ణయించిన ధరలను ఖచ్చితంగా అమలు చేసేటట్లు చూడడం సమంజసమేకాని, ఆ ధరకు సరఫరాచేసే హోటళ్ళలో నాణ్యత ఎట్లావుందోకూడా చూడవలసినబాధ్యత వారిపై వుంది. మరీ నెల్లూరుటౌన్‌లో హోటళ్ళు ఛండాలంగా వున్నాయి. పరిశుభ్రత అన్నది మచ్చుకుకూడా కన్పించదు. మునిసిపల్ సిబ్బందీ పట్టించుకోరు. మంచికాఫీ. మంచివాతావరణంలో ఇవ్వాలంటే, ధర గిట్టుబాటుకాదు. ఈసమస్య పరిష్కారమయ్యేదెట్లా?

### డాక్టర్ ఆర్. వి. రెడ్డి

డాక్టర్ ఆర్. వి. రెడ్డి (ఎం. ఫారం. పిహెచ్. డి.) భారత వాణిజ్యసంస్థ (ఎస్. టి. సి.) లోని ఐ. డి. పి. ఎల్. విభాగం ఛీఫ్ జనరల్ మేనేజరుగా నియమితులైనారు. మందులు, రసాయనాల ఎగుమతులు దిగుమతులేకాక; వినియోగదార్ల వస్తువులు, ఆర్మీ సాఫ్టువేర్, కన్జ్యూమర్‌వస్తువులు, ఫుడ్స్ ఎగుమతుల బాధ్యతలు వీరు నిర్వహిస్తారు. అంతేగాక రాష్ట్రాలకు చెందిన మార్కెటింగ్, చిన్నతరహాపరిశ్రమలు, డిపార్టుమెంటల్ స్టోర్సు వగైరా వ్యవహారాలనుకూడా చూస్తారు.

ఆర్. వి. రెడ్డిగారు స్వర్గీయ రేబాల లక్ష్మీనరసారెడ్డిగారి తోడల్లుని కుమారుడు; చిన్నతనమంతా నెల్లూరులోనే గడిచింది, ఆయన సి.ఎ.ఎం. హైస్కూలు విద్యార్థికూడా. ఉస్మానియా విశ్వవిద్యాలయం మాజీ వైస్‌ఛాన్సలర్ డి. ఎస్. రెడ్డిగారి అల్లుడు.

ఉన్నతస్థితికి వచ్చిన డాక్టర్ ఆర్. వి. రెడ్డిగారికి మా హృదయపూర్వక శుభాకాంక్షలు తెలియజేస్తున్నాము.

### సర్వోదయ కాలేజికి జేసిస్ విరాళం

నెల్లూరు సర్వోదయ కాలేజి భవన నిర్మాణానికి మద్రాసుకు చెందిన శ్రీ గోరంట్ల రామలింగయ్య స్వామిటీ 25వేల రూపాయల విరాళం ఇచ్చింది. నెల్లూరు జేసిస్‌క్లబ్‌ద్వారా ఈ విరాళం అందజేశారు.

జేసిస్‌కు కొత్త కార్యవర్గం ఎంపికైంది- అధ్యక్షుడుగా శ్రీ జి. రాధాకృష్ణ, ఉపాధ్యక్షులుగా శ్రీ కె. సురేంద్రబాబు, డాక్టర్ ఎ. లక్ష్మణరావు. కార్యదర్శిగా శ్రీ బి. సుబ్బారావు సంయుక్త కార్యదర్శిగా జె. వి. కె. బాబు, కోశాధికారిగా శ్రీ కె. మధుసూదనరావు ఎంపికైనారు. రాష్ట్ర జేసిస్ అధ్యక్షుడు శ్రీ పి. సాంబశివశాస్త్రి కొత్త కార్యవర్గంచేత ప్రమాణస్వీకారం చేయించారు. మునిసిపల్ కమీషనరు శ్రీ ఐ. ఎల్. నరసింహం సభను అధ్యక్షించారు.

మయూరి సుధతో నర్తకి మద్దాళి ఉషర

**మయూరి సుధ**

మయూరి చిత్రంద్వారా దేశ వ్యాప్త ఖ్యాతినార్జించిన నర్తకి కుమారి సుధ,

—6వ పేజీలో



**• నిర్యాణం •**

మా యింటి దైవం, మా అవ్వ

**దువ్వూరు క్రిష్టమ్మగారు**

తేది 14.1.86 స్వర్గస్థులైనారు.

**ఉత్తరక్రియలు**

తేది 28.1.86 మంగళవారం నిలుపు

తేది 29.1.86 బుధవారం పందిలి

తేది 30.1.86 గురువారం పెత్తరేపు

పేడూరులో మా స్వగృహమునందు జరుగును కాన, తెలుపుడమైనది.

తిక్కవరపు శివకోటారెడ్డి

# కావలి మునిసిపాలిటీ అవినీతితో కుళ్ళిపోతూంది!

ఈ గ్రాంటిద్వారా ఈ ఏడాది 80 లక్షల అప్పులిచ్చారట. 60 లక్షల ఓవర్‌డ్రాఫ్టు వచ్చాయట.

### కావలి మునిసిపాలిటీ

కావలి మునిసిపాలిటీలో మురుగు కంపేకాదు. అవినీతి దుర్గంధంకూడా దుర్భరమైపోతూంది: ఆఫీసులోకి తొంగి చూస్తే అందాల బొమ్మతో పరిపాలన కుర్చీ పోయి, ముక్కు పుటాలదిరేంత గబ్బు కొడుతూంది.

ఒకప్రక్క టౌనులో పారిశుద్ధ్యం, మచ్చుకైనా కనిపించడంలేదు. ఏ వీధిలో చూసినా పెంటకుప్పలు. మట్టి దిబ్బలు. ఏరులై వాగులై ప్రవహిస్తున్న మురుగునీరు. ప్రతిరాత్రీ శివరాత్రిగా పౌరులచేత జాగరణ చేయిస్తున్న దోమల స్వైరవిహారం. వెలగని వీధి దీపాలతో టౌనంతా అంధకారమయం. గలీజుగా, రోతగావుంది పరిస్థితి.

ఇంకొక ప్రక్క ఆఫీసులో చూస్తే, బిల్డింగు ప్లాను కావాలన్నా, డెత్ సర్టిఫికేట్ కావాలన్నా పిడికిలి విప్పితేనే పని జరిగేది: లేకుంటే ఖాళీ! గబ్బు గబ్బుగా వుంది అవినీతి. ఇవేవీ రహస్యమైన విషయాలు కావు. ఇదివరకు అధికార, ప్రతిపక్ష కౌన్సిలర్లు ఒకరిపై ఒకరు ఆరోపణాస్త్రాలు సంధించుకునేవారు. ఇప్పుడు కమీషనరు, ఛైర్మను ఒకరిమీద ఒకరు అవినీతి బురదను చల్లుకుంటూ వీధినబడుతున్నారు. అమర్త్య, ఛైర్మన్ ప్రజాధనం దుర్వినియోగం చేస్తున్నారని ప్రభుత్వానికి ఒక ఫిర్యాదువెళ్ళి, విచారణకూడా జరిగింది. దానివెనుక కమీషనరు హస్తం వుందన్నది జగమెరిగిన రహస్యం.

ఇందుకు ప్రతీకారంగా, ఛైర్మన్ శ్రీ ఉదయభాస్కర్ తన సంతకంతోనే కమీషనరుపై ఒక ఆరోపణల పత్రం సమర్పించారు. అరుణోదయ కాంప్లెక్సుకు పన్ను నిర్ణయంలో పెద్దఎత్తున లంచాలు తిన్నాడని, టెలిఫోనును ఇష్టంవచ్చినట్టు వాడుతున్నాడని, ఇంకా ఇంకా చాలా ఆరోపణలే చేశారు. ఆరోపణల తొలగింపు, రాజకీయ దురుద్దేశ్యపూరితం కావడంతో టౌనులోకూడా విపరీతమైన ఆగ్రహం రేగింది కమీషనర్‌మీద.

ఇదే సందుగా తీసుకొని, తెలుగుదేశం కౌన్సిలర్లు మునిసిపాలిటీనే రద్దుచేయమని రాయబారాలు నడుపుతున్నారు. మునిసిపల్ సిబ్బంది, ఛైర్మన్, కమీషనర్ వర్గాలుగాచీలి పనులుమాని, వినోద కాలక్షేపం చేస్తున్నారు. ఫలితంగా, మునిసిపాలిటీ పాకులలో పరువు కోల్పోవడమే కాదు-పరిపాలనకూడా స్తంభించిపోయి వుంది.

ప్రభుత్వం మునిసిపాలిటీని రద్దు చేయడమో, లేక కమీషనర్‌ను తక్షణమే బదిలీచేయడమో, జరగకుంటే ఈ ప్రతిష్టంభన తొలగదు.

## జిల్లావార్తలు

(5వ పేజీ తరువాయి)

### కావలికోర్టు కొత్త భవనం ప్రారంభం

కావలి డిస్ట్రిక్టు మునసఫ్‌కోర్టులో, కేంద్రప్రభుత్వ గ్రాంటుతో కొత్తగా నిర్మించిన అడిషనల్ మేజస్ట్రేట్‌కోర్టు భవనాన్ని ఇటీవల జిల్లాజడ్జి శ్రీ బి.శివసాంబమూర్తి ప్రారంభించారు. దీనికి 3లక్షలా 60 వేలు ఖర్చయిందట. ఉదయగిరి తాలూకాకుచెందిన కేసులుకూడా కావలి సబ్‌కోర్టు పరిధిలోకి వచ్చేటట్లు చూడగలనని ఆయన మాటయిచ్చారు.

సబ్‌జడ్జి శ్రీమతి భద్రాంబ రాజన్ ఈ సభలో ప్రసంగిస్తూ జ్యుడిషియల్ అధికారులకు ప్రత్యేక గృహవసతి కల్పించడం ప్రభుత్వ ధర్మమన్నారు.

బార్ ప్రెసిడెంట్ శ్రీ మొదలి కృష్ణమూర్తి అధ్యక్షత వహించారు: మున్సిఫ్ మేజిస్ట్రేట్ శ్రీ రామకృష్ణారెడ్డి వందనాలు చెప్పారు. కోవూరు కోర్టునుంచి శ్రీ జగన్నాధరావును బదిలీచేసి, ఇక్కడ అదనపు మున్సిఫ్ మేజిస్ట్రేట్‌గా నియమించారు.

### కావలి రికార్డ్ అసిస్టెంట్స్

కావలి తాలూకా రికార్డ్ అసిస్టెంట్ల సంఘానికి అధ్యక్షుడుగా వి. సుధాకరరావు, ఉపాధ్యక్షుడుగా కె. రామిరెడ్డి, కార్యదర్శిగా నరసింహారావు, ఉపకార్యదర్శిగా ఆర్. జయరామయ్య, కోశాధికారిగా వై. శంకరరెడ్డి ఎన్నికైనారు.

### బిట్రగుంట కంటిశిబిరం

కావలి లయోన్సక్లబ్ 26 నుంచి 31 తేది వరకు బిట్రగుంట రైల్వే ఇన్స్టిట్యూట్‌లో ఉచిత నేత్ర శిబిరం నిర్వహించబోతూంది. కంటి రోగులకు మంచి అవకాశం.

### బిట్రగుంట కార్డుల లబోదిబో

పాత బిట్రగుంట పంచాయతీలో కొత్తగా చక్కెరకార్డులువ్రాసే విషయంలో చాలా అవకతవకలు జరిగాయని శ్రీ షేక్ ఖాసిం ఆరోపిస్తున్నారు. ఎన్యూమరేటరు ఇళ్ళిళ్ళు తిరగలేదని, వ్యవసాయకూలీలు పనులకుపోయిన సమయంలో వచ్చి, వున్నవారి పేర్లుమాత్రమే రాసుకున్నాడని ఫలితంగా పలుకుటుంబాలకు కార్డులు లేకుండాపోయాయని అయనంటాడు, ఎం ఆర్ ఒ విచారించాలి!

### అల్లూరు రైతు సంఘం

అల్లూరుమండల రైతుసంఘం పేరుతో ఒక కొత్త సంస్థ ఏర్పాటైంది. దీనికి అధ్యక్షుడుగా శ్రీ కనుమూరు గోపాలరెడ్డి, ఉపాధ్యక్షుడుగా పుచ్చలపల్లి వెంకారెడ్డి, కార్యదర్శిగా మేడా రాఘవరెడ్డి, సహాయ కార్యదర్శిగా నెల్లూరు నరసారెడ్డి, కోశాధికారిగా సి. పరెడ్డి దశరథరామిరెడ్డి, కార్యవర్గ సభ్యులుగా ఎరటపల్లి చంద్రారెడ్డి, లేబూరు ఆదిశేషారెడ్డి ఎన్నికైనారు.

### షార్ ఉద్యోగులు

షార్ ఎంప్లాయీస్ అసోసియేషన్‌కు కొత్త కార్యవర్గం ఎంపికైంది. అధ్యక్షుడుగా శ్రీ ఎస్. సుభాష్‌చంద్రుడు, ఉపాధ్యక్షులుగా శ్రీ ఎస్. ప్రేమానందరెడ్డి, పి. సుబ్రహ్మణ్యరెడ్డి, ప్రధాన కార్యదర్శిగా కె. సాంబశివయ్య, కోశాధికారిగా ఎన్. మల్లికార్జునం, ప్రాంతీయ కార్యదర్శులుగా శ్రీ వై. రాజేంద్రప్రసాద్, టి. ప్రసాద్, బి. సురిసూపదం, షేక్ మస్తాన్, శ్రీమతి సయద్ బేగం ఎన్నికైనారు.

### సౌత్ మోపూరు పొదుపు

సౌత్‌మోపూరులోని వాణిశ్రీ జి. ప. హైస్కూలులో జాతీయ పొదుపు పథకం క్రింద విద్యార్థులు రు 3500 లు దాచుకున్నారట. విద్యార్థులకు, తల్లిదండ్రులకు థ్యాంక్స్ చెప్తున్నారు హెడ్మాష్టరు శ్రీ ఎల్. రామకృష్ణయ్య.

### కలిచేడు గనిసభ

అం. ప్ర. గని సాంకేతికోద్యోగుల సంఘం సర్వసభ్య సమావేశం ఇటీవల జరిగింది. సి. హెచ్. పోలిరెడ్డి అధ్య

....తరువాయి 8వ పేజీలో





## దేవస్థానము బంగారు నగల అమ్మకము ప్రకటన

నెల్లూరుజిల్లా, నెల్లూరు తాలూకా, పాట్టెంపాడు గ్రామములో వేంచేసి యుండు శ్రీ కోదండరామస్వామి దేవస్థానము తాలూకు ఈ క్రింద తెలుపబడిన బంగారు నగలు ఆంధ్రప్రదేశ్ దేవాదాయ ధర్మాదాయశాఖ కమీషనరు వారి ఉత్తరువులు డి.డిస్. నెం. పి 3/13700/85 18-12-85 తేది మేరకు గుంటూరు డివిజన్ ఆభరణముల తనిఖీ అధికారి మరియు నెల్లూరుజిల్లా దేవాదాయశాఖ సహాయ కమీషనరువారి సమక్షమున వారి కార్యాలయములో తేది 20-2-1986 మధ్యాహ్నం 2 గం॥ నుండి ఈ క్రింది షరతులకు లోబడి బహిరంగవేలములో కార్యనిర్వహణాధికారిచే అమ్మబడును.

– బంగారు నగల వివరము –

| | |
|---|---|
| 1) రెండుపేట పగడాల దండ-1 | గ్రా. మి.గ్రా. |
| (బంగారు పలకలు-26, పగడములు 84) | 103-500 |
| 2) ఒంటిపేట పగడాల దండ-1 | |
| (బంగారు పలకలు 20, పగడాలు 60) | 73.400 |
| 3) రవ్వలకమ్మలు జత-1 (వజ్రాలు 12, నీలాలు 2) | 5.800 |
| 4) యజ్ఞోపవీతము (ఆరుపేట)-1 (9 Small belts with Mopu 16 White Stones, 1 Green Stone 12 Red Stones) | 13.5000 |
| 5) పెద్దకాసుల దండ-1(119 కాసులు కలది) | 235.500 |

– షరతులు –

1) పాటలో పాల్గొనుటకు ముందు ప్రతి పాటదారు రూ. 1000/-లు ధరావత్తు చెల్లించవలెను.
2) హెచ్చు పాటదారు పాట ముగిసినవెంటనే అంగీకరింపబడిన హెచ్చు పాట మొత్తములో మూడవ వంతు పైకము చెల్లించవలెను.
3) హెచ్చుపాట కమీషనరువారి ఆమోదమునకు లోబడియుండును.
4) యితర షరతులు నెల్లూరు సహాయ కమీషనరువారి కార్యాలయమునందు పనిచేయు వేళలలో విచారించి తెలుసుకొనవచ్చును.

: వంశపారంపర్య ధర్మకర్తలు :

శ్రీమతి మోపూరు సౌందర్యమ్మ, శ్రీమతి దొడ్ల శేషమ్మ

జి. ప్రభాకర్
కార్యనిర్వహణాధికారి

—కొరకు 7వ పేజీలో

## జిల్లావార్తలు

(రిపోర్టర్లనుండి)

కించారు. నెల్లూరు గనులఅధికారి శ్రీ ఎ.టి. మూర్తి, శ్రీ ఆర్. సుబ్బరామయ్య శ్రీ టి. పాపయ్య, ఒకేషనల్ ట్రైనింగ్ ఆఫీసరు శ్రీ ఎ. రంగారెడ్డి తదితరులు మాట్లాడారు. గనిప్రమాదంలో మరణించిన శ్రీ సుబ్రహ్మణ్యం అనే ఉద్యోగి సతీమణికి వెయ్యిరూపాయల పరిహార్ధ విరాళంగా అందజేశారు.

### నెల్లూరు మైనారిటీస్ కార్పొరేషన్ ఆఫీసు

నెల్లూరులోకూడా మైనారిటీస్ ఫైనాన్స్ కమిషన్ కార్యాలయం తెరుస్తామని కార్పొరేషన్ డైరెక్టరు, రాష్ట్ర తెలుగుదేశం కోశాధికారి శ్రీ ఒడూరు గౌస్‌మొహిద్దీన్ గూడూరులో చెప్పారు. ఈ కార్పొరేషన్ తరపున ఈ ఏడాది మైనారిటీలకు కోటి రూపాయల ధనసాయం చేస్తామనికూడా ఆయన చెప్పాడు. రిక్షాలు, చిన్న అంగళ్ళు పెట్టుకోడానికి వీరు అప్పు లిస్తారు.

గౌస్‌మొహిద్దీన్ మునిసిపల్ కౌన్సిలరు, వక్ఫ్‌బోర్డు సభ్యుడు. ఆయనకు పార్టీలో రాష్ట్రస్థాయి గుర్తింపులభించడం పలువురు గూడూరీయులకు సంతోషం కల్గించింది.

### నాయుడికి సన్మానం

జిల్లా తెలుగుదేశం ప్రధాన కార్యదర్శిగా, రాష్ట్ర డ్రైనేజిబోర్డు సభ్యుడుగా నియమితుడైన డాక్టర్ ప్రభాకరనాయుడికి కావలిలో పెద్ద సన్మానం జరిగింది. శ్రీ ఎం. వి. నారాయణ అధ్యక్షించారు: కౌన్సిలర్ శ్రీ కె. ఆనందరావు సన్మాన పత్రం చదివారు: డాక్టర్ వెంకారెడ్డి, నాయుడు రాంప్రసాద్, మునిసిపల్ కమిషనరు శ్రీ విజయప్రసాద్ తదితరులు మాట్లాడారు.

### నాయుడుపేట వృత్తివిద్య

నాయుడుపేట జి. ప. బాలుర హైస్కూలులో వృత్తివిద్యా కోర్సులు మొదలైనాయి. జి. ప. ఛై. శ్రీ వీరయ్య వీటిని ప్రారంభించి, స్థానికక్లబ్ బహూకరించిన మోటారుకు స్విచ్‌ఆన్ చేశారు. సభకు సర్పంచ్ శ్రీ చదలవాడ కృష్ణమూర్తి అధ్యక్షించారు: హెడ్మాస్టర్ శ్రీ ఆర్. వి. జి. కృష్ణమూర్తి స్కూలు సమస్యలు చెప్పారు.

### వాసిలి దొంగ దొరికాడు

ఆత్మకూరు తాలూకా వాసిలిలో 7 తేది రాత్రి పైడా వెంకటశేషయ్య అనే వ్యాపారి ఇంటికి కన్నంవేసిన షేక్ గౌస్ (20) అనే దొంగను, గ్రామస్తులు చుట్టుముట్టి పట్టుకున్నారట. ఇతడు జిల్లాలో పేరుమోసిన దొంగలాకారుడట.

### దేగపూడి వీధిలైట్లు

దేగపూడి గ్రామానికి చెందిన బలహీన వర్గాల ఇళ్ళకాలనీలో 10 వీధిదీపాలకు గూడూరు ఎలక్ట్రిసిటీ ఎ. డి. ఇ. శ్రీ సుందర రామరెడ్డి ఇటీవల స్విచ్‌ఆన్‌చేశారు. సభను మరొక ఎ. డి. ఇ. శ్రీ మునిరత్నం నాయుడు అధ్యక్షించారు. గ్రామస్తుడు శ్రీ పులి సుబ్బారెడ్డి ప్రసంగించారు. ఈ వీధిదీపాలకు 14 వేల రూపాయలు ఖర్చయిందట.

### పొదలకూరు దీక్షలు

ఉపాధ్యాయుల తదితర సమస్యల పరిష్కారంకోసం పొదలకూరు టి ఎన్. యు టి ఎఫ్ ఆధ్వర్యంలో 27 తేది నుంచి సమితి ఆఫీసు ఎదుట రిలేదీక్షలు చేయాలని నిశ్చయించారు. టీచర్లందరూ కలిసి రావాలని శ్రీనివాసరావు కోరుతున్నారు. ★

(6వ పేజీ కొరవ)

...నెల్లూరు ... కళాక్షేత్రంలో నృత్యప్రదర్శన చేసింది. కళాభారతి ... శ్రీ శంకర్‌ప్రసాద్ ఏర్పాటు చేసిన కార్యక్రమం ఇది.

## సిటీ వర్షపాతం

| | |
|---|---|
| కలిగిరి రిజర్వాయరు | 21.45 అ. |
| సర్వేపల్లి | 10.70 అ. |
| నెల్లూరు చెరువు | 16.75 అ. |

## నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకు | (9672) | 1800-00 |
| ,, | (9674) | 1900-00 |
| ,, | (క్రొత్తవి) | 1350-00 |

## బాలచెన్నయ్య

(మొదటి పేజీ కొరవ)

అధికారులెందుకు అనుసరిస్తున్నారో ప్రభుత్వం ఎందుకు ఇట్లా అనుమతించిందో ఊహాతీతం.

బాలచెన్నయ్య ఇప్పటివరకు, అధికారులను ప్రతిఘటించలేదు. ఎల్లోరి శ్రీనివాసులురెడ్డి ఒకప్రక్క బదలీలు. గిరలీలు చేస్తున్నా పట్టించుకోవడంలేదు.

## పంచాంగం

**జనవరి తిథులు**

25 శని పూర్ణిమ తె. 6-10 గం. వ.
26 ఆది బ. పాడ్యమి తె. 6-26 గం.వ
27 సోమ విదియ తె. 6-11 గం. వ.
28 మంగళ తదియ తె. 5-34 గం.వ.
29 బుధ చవితి తె. 4-17 గం. వ.
30 గురు పంచమి రా. 2-41 గం. వ.
31 శుక్ర షష్టి రా. 12-48 గం. వ.

—నిమ్మగడ్డ వేంకటేశ్వరశాస్త్రి



# ఆంధ్ర బ్యాంకు - మేనకూరు బ్రాంచి

## బంగారు నగలు వేలము ప్రకటన - 6వ పేజీ కొరవ

| వ. నెం. | వ్యక్తి పేరు మరియు చిరునామా | నికరతూకం (గ్రాములలో) |
|---|---|---|
| 3) | కట్టంరెడ్డి జయరామిరెడ్డి తండ్రి సుబ్బరామిరెడ్డి<br>పాలచూరు నాయుడుపేట తాలూకా | 58 |
| 4) | యాకశిరి ప్రభాకరరెడ్డి తండ్రి జయరామిరెడ్డి<br>పాలచూరు నాయుడుపేట తాలూకా | 60 |
| 5) | రోసనూరు వెంకటసుబ్బయ్య తండ్రి రామదాసయ్య<br>పాలచూరు నాయుడుపేట తాలూకా | 14 |
| 6) | కె. పెంచలయ్య తండ్రి పెంచలయ్య<br>పాలచూరు నాయుడుపేట తాలూకా | 24 |
| 7) | పి. పోలయ్య తండ్రి మల్లయ్య<br>మేనకూరు నాయుడుపేట తాలూకా | 20 |
| 8) | నూర రమణయ్య తండ్రి వెంకటస్వామయ్య<br>గ్రద్దగుంట నాయుడుపేట తాలూకా | 23 |
| 9) | వేణుంబాక మునుస్వామిరెడ్డి తండ్రి సుబ్బారెడ్డి<br>పాలచూరు నాయుడుపేట తాలూకా | 54 |
| 10) | కాటంరెడి రామకృష్ణారెడి, తండ్రి సుబ్బరామరెడి<br>పాలచూరు, నాయుడుపేట తాలూకా | 17 |
| 11) | గంపల మస్తానయ్య, తండ్రి నరసింహులు<br>మేనకూరు, నాయుడుపేట తా॥ | 19 |
| 12) | కట్టంరెడి సుబ్బరామిరెడి, తండ్రి కోటారెడి<br>అత్తివరం, వెంకటగిరి తా॥ | 34 |
| 13) | గణపతి బలరామయ్య, తండ్రి పిచ్చయ్య<br>పాలచూరు, నాయుడుపేట తా॥ | 4 |
| 14) | నాశిన వెంకటకృష్ణయ్య, తండ్రి పుల్లయ్య<br>మేనకూరు, నాయుడుపేట తా॥ | 5 |
| 15) | గణపతి గురునాథంశెట్టి, తండ్రి వెంకట్రామయ్య<br>పాలచూరు, నాయుడుపేట తా॥ | 19 |
| 16) | పి. గురునాథ ప్రకాశరావు తండ్రి చిన్నగురునాథంశెట్టి<br>మేనకూరు, నాయుడుపేట తా॥ | 09 |
| 17) | గంగాబత్తిన భద్రయ్య తండ్రి పుల్లయ్యశెట్టి<br>మేనకూరు, నాయుడుపేట తా॥ | 15 |
| 18) | షేక్ మస్తాన్‌సాహెబ్, తండ్రి బడేసాహెబ్<br>అత్తివరం. వెంకటగిరి తా॥ | 8 |

### వేలం తేది : 20-2-86

| వ. నెం. | వ్యక్తి పేరు మరియు చిరునామా | నికరతూకం (గ్రాములలో) |
|---|---|---|
| 1) | నలజాం లక్ష్మయ్య తండ్రి బాలసాదయ్య<br>గ్రద్దగుంట నాయుడుపేట తాలూకా | 5 |
| 2) | యామాల మీరయ్య తండ్రి వీరయ్య<br>నెమళ్లపూడి నాయుడుపేట తా॥ | 7 |
| 3) | ఇనుగుంట తాటయ్య తండ్రి లక్ష్మయ్య<br>ఎర్రపుశెట్టిపాలెం నాయుడుపేట తా॥ | 8 |
| 4) | రామబత్తిన వెంకటేశ్వర్లు తండ్రి సుబ్బరామయ్య<br>మనవాలి నాయుడుపేట తా॥ | 9 |
| 5) | చవుటూరు ధర్మయ్య తండ్రి పెంచలయ్య<br>వెంబేడు నాయుడుపేట తా. | 14 |
| 6) | ముమ్మూరు మల్లయ్య తండ్రి కస్తూరయ్య<br>గ్రద్దగుంట నాయుడుపేట తా॥ | 15 |
| 7) | కుక్కా రామయ్య తండ్రి రామయ్య<br>మేనకూరు నాయుడుపేట తా॥ | 16 |
| 8) | వ్యంటరి రమణయ్య తండ్రి శ్రీనివాసులు<br>బద్దిగుంట కండ్రిగ నాయుడుపేట తా॥ | 18 |
| 9) | మైలారి రమణయ్య తండ్రి నల్లయ్య<br>మేనకూరు నాయుడుపేట తా॥ | 19 |
| 10) | కొండూరు మునెయ్య తండ్రి వీరయ్య<br>నెమళ్లపూడి నాయుడుపేట తా॥ | 32 |
| 11) | ముప్పాళ్ల వెంకటకృష్ణారెడి తండ్రి సుబ్బారెడి<br>భీమవరము నాయుడుపేట తా॥ | 5 |
| 12) | పఠాన్ ఖాజారహమతుల్లా తండ్రి ఖాదర్‌సాహెబ్<br>భీమవరము నాయుడుపేట తా॥ | 10 |
| 13) | కట్టంరెడి సుబ్బరామిరెడి తండ్రి వెంకటక్రిష్టారెడి<br>పాలచూరు నాయుడుపేట తా॥ | 16 |
| 14) | బరుగు వెంకటరాయులు తండ్రి వెంకటయ్య<br>మేనకూరు నాయుడుపేట తా॥ | 19 |
| 15) | ముమ్మడి పిచ్చయ్య తండ్రి వెంకటసుబ్బయ్య<br>కరబల్లవోలు నాయుడుపేట తా॥ | 20 |
| 16) | గంగాబత్తిన దామోదరం తండ్రి వీరభద్రయ్య<br>మేనకూరు నాయుడుపేట తా॥ | 20 |
| 17) | గంగాబత్తిన వీరభద్రయ్య తండ్రి తండ్రి సిద్దయ్య<br>మేనకూరు నాయుడుపేట తా॥ | 25 |
| 18) | తమ్మూరు బంగారయ్య తండ్రి చిన్నయ్య<br>అత్తివరము వెంకటగిరి తాలూకా | 50 |
| 19) | గుజ్జలపూడి నాగభూషణనాయుడు తండ్రి కన్నయ్యనాయుడు<br>పున్నేపల్లి నాయుడుపేట తా॥ | 57 |
| 20) | దాసరి శంకరయ్య తండ్రి పేరయ్య<br>మేనకూరు నాయుడుపేట తా॥ | 3 |

### వేలం తేది 21-2-86

| వ. నెం. | వ్యక్తి పేరు మరియు చిరునామా | నికరతూకం (గ్రాములలో) |
|---|---|---|
| 1) | గడ్డం రమణయ్య, తండ్రి మునుస్వామి<br>గ్రద్దగుంట. నాయుడుపేట తా॥ | 15 |
| 2) | కల్లూరు నారయ్య, తండ్రి వెంకటయ్య<br>పున్నేపల్లి, నాయుడుపేట తా॥ | 30 |
| 3) | ఎ. జయరామయ్య, తండ్రి వెంకయ్య<br>గ్రద్దగుంట, నాయుడుపేట తా॥ | 45 |
| 4) | పుట్టా వేణయ్య, తండ్రి వెంకయ్య<br>యర్రంశెట్టిపాలెం, నాయుడుపేట తా॥ | 4 |
| 5) | యం. క్రిష్ణయ్య, తండ్రి వెంకటసుబ్బయ్య<br>కరబల్లవోలు, నాయుడుపేట తా॥ | 6 |
| 6) | ముప్పాళ్ళ జయరామరాజు, తండ్రి సుబ్బరాజు<br>కోనేటి రాజుపాలెం, నాయుడుపేట తా॥ | 6 |
| 7) | కొండూరు క్రిష్ణయ్య, తండ్రి గురవయ్య<br>మేనకూరు, నాయుడుపేట తా॥ | 8 |
| 8) | జ్యోతి రాజయ్య, తండ్రి నరసయ్య<br>పాలచూరు. నాయుడుపేట తా॥ | 13 |
| 9) | తుమ్మూరు వెంకటసుబ్బయ్య, తండ్రి కాలయ్య<br>అత్తివరము, వెంకటగిరి తా॥ | 28 |
| 10) | కనపర్తి వెంకటరమణయ్య తండ్రి నాగయ్య<br>గ్రద్దగుంట, నాయుడుపేట తా॥ | 33 |
| 11) | కట్టంరెడి వెంకటక్రిష్టారెడి.<br>భీమవరము, నాయుడుపేట తా॥ | 25 |
| 12) | రోసనూరు సుబ్బరామయ్య, తండ్రి జయరామయ్య<br>పాలచూరు, నాయుడుపేట తా॥ | 14 |
| 13) | పి. సుగుణభూషణరావు, తండ్రి వెంకట్రామయ్య<br>మేనకూరు, నాయుడుపేట తా॥ | 18 |
| 14) | కట్టా సిద్దయ్య, తండ్రి గంగయ్య<br>మేనకూరు, నాయుడుపేట తా॥ | 8 |
| 15) | నాసిన ఈశ్వరయ్య, తండ్రి లింగయ్య<br>మేనకూరు, నాయుడుపేట తా॥ | 3 |
| 16) | గణపతి విజయరామయ్య, తండ్రి రామచంద్రయ్య<br>మేనకూరు, నాయుడుపేట తా॥ | 38 |
| 17) | గంటవరము రాజగోపాలరెడి, తండ్రి శంకరరెడి<br>కప్పగుంటకండ్రిగ, నాయుడుపేట తా॥ | 15 |
| 18) | నాయుడు రఘురామిరెడి, తండ్రి వీరాస్వామిరెడి<br>అత్తివరము, వెంకటగిరి తా॥ | 75 |
| 19) | కనుమూరు శంకరరెడి, తండ్రి కృష్ణారెడి<br>అత్తివరము, వెంకటగిరి తా॥ | 123 |
| 20) | బందిల వీరరాఘవయ్య, తండ్రి బక్కయ్య<br>మేనకూరు, నాయుడుపేట తా॥ | 4 |

-బ్రాంచి మేనేజరు

## జిల్లాపరిషత్ - నెల్లూరు

# ఉద్యోగములకు ప్రకటన

Rc. A. 7. No. 196/86

**నెల్లూరు జిల్లాపరిషత్ పరిధిలోగల విద్యాసంస్థలందు, ప్రభుత్వ పాఠశాలలయందు ఈ క్రింది ఉపాధ్యాయుల ఖాళీలకు, నెల్లూరు జిల్లాలోని అర్హతగలిగిన అభ్యర్థులనుండి దరఖాస్తులు కోరడమైనది**

| క్ర. సం. | ఉద్యోగము పేరు | జీతము స్కేలు | వయస్సు 1-7-85 తేది నాటికి | ఖాళీల సంఖ్య: షె. కు. | షె. తె. | వెనుకబడిన తరగతులు: ఎ. | బి. | సి. | డి. | ఒ. సి. | పి. హెచ్. | మొత్తము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| నెల్లూరు జిల్లా పరిషత్ యాజమాన్యంలోనున్న పాఠశాలలలోని ఖాళీలు : | | | | | | | | | | | | |
| 1. | వీవింగ్ టీచర్లు | 530-15-590-20-850 | 18 సం. పైన 36 సం. లోపల | – | 1 | – | – | – | – | 3 | – | 4 |
| 2. | డ్రాయింగ్ టీచర్లు | ,, | ,, | – | 2 | – | – | – | – | – | – | 2 |
| 3. | మ్యూజిక్ మిస్ట్రెస్ | ,, | ,, | 1 | – | – | – | – | – | 1 | – | 2 |
| 4. | స్పెషల్ టీచర్లు (తెలుగు మీ.) | ఫిక్సెడ్ జీతము రు. 398/– | ,, | 1 | 44 | 35 | 47 | 5 | 35 | 269 | – | 436 |
| నెల్లూరుజిల్లా ప్రభుత్వ పాఠశాలలోని ఖాళీలు : | | | | | | | | | | | | |
| 5. | సెకండరీ గ్రేడు టీచర్లు | 530-15-590-20-850 | ,, | 1 | – | – | – | 1 | 1 | 4 | – | 7 |
| 6. | పి. ఇ. టి. లు. గ్రేడు-1 | ,, | ,, | – | – | 1 | – | – | – | 1 | – | 2 |
| 7. | పి. ఇ. టి. లు. గ్రేడు-2 | ,, | ,, | – | – | 1 | – | – | – | 2 | 1 | 4 |
| 8. | హింది పండిట్ గ్రేడ్-2 | ,, | ,, | 1 | – | – | – | – | – | – | 1 | 2 |
| 9. | వీవింగు టీచరు | ,, | ,, | – | – | – | – | – | – | 1 | – | 1 |
| 10. | డ్రాయింగ్ టీచరు | ,, | ,, | 1 | – | – | – | – | – | 1 | – | 2 |

### Minimum Educational Qualifications:

**For Category 1 and 9 (Weaving Teachers)**

i) Minimum General Educational qualifications: S.S.C.

ii) Industrial school Leaving Certificate or a National Certificate in Craftmanship in the appropriate subject with not less than 5 years practicial experience and preferably one year teaching experience. Or a TTC of Higher grade

**For category 2 and 10 (Drawing Teachers)**

i) A group certifciate in Drawing with T.T.C. of the higher grade. (or)
A technical teacher's certificate of the Higher Grade or Intermediate certificate examination (two years' course) of the Government College of Fine Arts and Architecture Hyderabad in (a) Painting or (b) Sculpture or Commercial Art

and

A certificate in drawing plus the T. T. C. of Government of A. P. in any one of the Drawing subjects.
or Drawing examinations Grade II Higher of the erstwhile Government of Hyderabad and one year's drawing and Manual teachers training course of the Government College of Fine Arts or

a certificate in drawing plus T. T. C. of Madras.

**For Category 3 (Music Mistress Ladies only)**

i) A pass in VIII Class or III form

ii) A diploma in music of a recognised Music School/College and T T C of Lower Grade in Music

**For category 4. (special teachers)**

i) S. S. L. C. or Intermediate and

ii) A trained teachers Certificate of the Secondary Grade or the Senior Basic Grade or an equivalent thereto or the certificate Teachers Training Institute Intermediate trained
If trained candidates are not available to the post of Special Teacher, untrained candidates who possess minimum general educational qualifications ie,, pass in Intermidiate examinations with 45 % marks in single attempt will be considered. The e will be relaxation

### ధరఖాస్తు నమూనా

ఉద్యోగము పేరు..........................................................

1. ధరఖాస్తుదారుని పూర్తిపేరు
2. తండ్రి పేరు
3. దరఖాస్తుదారుని పూర్తి చిరునామా పోస్టలుఅడ్రసు
4. పుట్టిన తేది 1-7-85 నాటికి పూర్తి అయిన సంవత్సరములు
5. కులము, మతము
6. అభ్యర్థి షెడ్యూల్డు కులము, షెడ్యూల్డు తెగలు, వెనుకబడిన తరగతులు, ఫిజికలీ హ్యాండికేప్డ్ తరగతులకు చెందినవారా?

అభ్యర్థియొక్క పాసుపోర్టు ఫోటో అతికించి గజిటెడ్ అధికారిచే ధృవీకరించవలెను.

అయినచో.... మండల రెవెన్యూ అధికారినుండి పొందిన ధృవీకరణ పత్రము జతపరచినారా?

7. విద్యార్హతలు
ఎ. సాధారణ
బి. ఉపాధ్యాయ శిక్షణ............
ఉత్తీర్ణత సర్టిఫికేటులు మరియు
మార్కులజాబితా నకళ్ళు జతపరచవలయును.
8. స్వస్థానము, మండలము, జిల్లా
9. ఉద్యోగ అనుభవము
అనుభవము కలవారు సర్వీసు సర్టిఫికేటులు జతపరచవలెను.
10. నెల్లూరుజిల్లా ఉపాధికల్పనా కార్యాలయంలో రిజిస్ట్రేషను నెంబరు.

తరువాయి 12వ పేజీలో



'స్రవంతి'లో సుహాసిని

## మనవాళ్లూ మంచి చిత్రాలు తీస్తారని నిరూపించింది

# స్రవంతి

మంచి సినిమా అంటే ఎట్లా వుంటుందో తెలియని అంధకారంలో తెలుగు ప్రేక్షకులున్న రోజులివి. ఎవరెంత ఎక్కువ డబ్బు తెచ్చిపెట్టగలిగితే, వాడే ఉత్తమోత్తమ దర్శకుడు. అర్ధనగ్న నృత్యాలు, [illegible]ింతలు, పార్లికింతల యుగళగీతాలు, అసభ్య శృంగార సంభాషణలు చూపించి, ప్రేక్షకుడి అభిరుచులను దిగజార్చి, చవుకబారు తనానికి నెమలి ఫించం తగిలిస్తున్నారు ఈ కమర్షియల్ దర్శకులు. పైగా వీరు కళాత్మక విలువలున్న చిత్రాలను ప్రేక్షకులు ఆదరించరని పిడివాదం చేస్తుంటారు. అయితే ప్రేక్షకుల నీచాభిరుచులతో ఖజానాలు నింపుకోవాలనే ఈ సంస్కారహీనుల సరసనే, వ్యాపార ప్రయోజనం దెబ్బతినకుండానే మంచి చిత్రాలు నిర్మించాలనే తపన, పట్టుదల కలిగిన దర్శకులు, నిర్మాతలుకూడా వున్నారు. వారిలో క్రాంతికుమార్‌ది ప్రత్యేకస్థానం. శారదనుంచి ఆయన తీసిన చిత్రాలన్నీ ప్రేక్షకాదరణను నోచుకున్నాయి; అయితే చవుకబారు తనానికి వాటిలో వేటిలోనూ స్థానం లేదు.

### చిత్రసమీక్ష

క్రాంతికుమార్ దర్శకత్వం వహించిన 'స్రవంతి', ఆయన సంస్కృతికి చక్కటి సాదృశ్యం. బామ్మగారి నీడలో బిడియాన్ని, ఛాందస భావాలను జీర్ణించుకొని పెరిగిన అమాయకపుపిల్ల స్రవంతి. ఏదో ఆవేశంలో, మృత్యువును వాకిట కాపలాగా పెట్టుకున్నాడని తెలిసీ చిరంజీవి అనే సహోద్యోగిని పెళ్లాడుతుంది. అనుకున్నట్లే అతను ఆరునెలలలోగా మరణిస్తాడు. పోతూపోతూ చివరికోరికగా స్రవంతి ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూ జీవించాలని మరొకరికి ఇల్లాలు కావాలని కోరుతాడు. ఆకోరిక నెరవేరుస్తూ, కారుప్రమాదంలో భార్యను కోల్పోయి ఆవిటికూతురుతో కష్టాలు పడుతున్న శరత్‌బాబును పెళ్లాడుతుంది. కాని, అతడు చిరంజీవి జ్ఞాపకాలను చీకలేని స్రవంతి హృదయాన్ని గాయపరుస్తాడు. ఆమె, భర్తనువదలి చిరంజీవి తల్లిదండ్రుల సేవను స్వీకరిస్తుంది. అంతటితో శుభం.

ప్రాణానికి ప్రాణంగా ప్రేమించిన ప్రియుని వాంఛ ఈడేర్చడానికి, జీవితాన్ని త్యాగంచేసిన ఆదర్శ యువతి జీవితమే, ఇతివృత్తం. అసలు, చావ సిద్ధంగావున్న వ్యక్తిని తెలిసితెలిసి స్రవంతి వంటి లోకమెరుగని అమాయకపిల్ల పెళ్లాడడం సహజత్వానికి దగ్గరగా వుందా అనే ప్రశ్న ఒకటి వుంది. ఎంత ఉత్తమ చిత్రమైనా, అంతా వాస్తవికంగా వుండాలన్న వాదం ఆచరణసాధ్యంకాదుకదా? ఈ చిత్రంలోని ప్రత్యేకత-కథానాయిక చుట్టే కథ పరిభ్రమించడం. హీరో కథనం కోసిన సృష్టించబడ్డవాడేకాని, కథానాయకుడుకాదు. కేవలం స్త్రీపాత్రతోనే చిత్రాన్ని పకడ్బందీగా నిర్మించడం కష్టమైనకార్యం; అందులో దర్శకుడు సఫలీకృతుడైనాడు.

చిత్రంలో ఎక్కడా "అతి" లేదు; అసభ్యతలేదు; అసహజత్వంలేదు; అనాగరిక శృంగార క్రీడలులేవు: అసహ్యపు ద్వంద్వార్థాల సంభాషణలులేవు; అయినా చిత్రం సాధారణ ప్రేక్షకుడినికూడా ఆకర్షిస్తుంది; అభినందనలందుకోగల్గుతుంది. దర్శకుని ప్రతిభ వ్యక్తమయ్యేది కూడా ఇక్కడే!

స్రవంతి పాత్రను చాలా సమర్థంగా రూపొందించారు; అందుకు తనను ఎంపికచేయడంలో పొరపాటు జరగలేదని నిరూపించింది సుహాసిని. అమాయకపు ఆడపిల్లగా, ప్రియుని కోరికను తీర్చడానికి దుఃఖాన్ని తొక్కిపట్టి నవ్వుతూ బ్రతికే ఆదర్శప్రేయసిగా, అవిటిపిల్లకు తల్లిగా, వివిధ మానసిక పరిస్థితులలో ఆమె హావభావాలు అత్యద్భుతంగా వున్నాయి.

స్రవంతిలో మనకేమీ సందేశాలు కన్పించకపోవచ్చు; అవార్డుల దృష్టితో చూస్తే, అందుకర్హమైనది కాకపోవచ్చు. కాని స్రవంతి నిస్సందేహంగా మంచి చిత్రం. ఉత్తమం కాకపోయినా నష్టం లేదు. వ్యాపారం, కళాత్మక విలువలు, సంస్కారభోరణి కలగలిపికూడా చిత్రాలు తీయవచ్చని నిరూపించిన చిత్రమిది.

—డోలేంద్ర

# ఈఏడాది చిత్రాల సంఖ్యలో తెలుగుసీమకే తొలి స్థానం!

1985 ఆరంభంనుంచి కొన్ని నెలల పాటు తెలుగు చలనచిత్ర పరిశ్రమలో ఆర్థిక సంక్షోభం, అనిశ్చిత పరిస్థితి లాంటివి ఏర్పడినా- విడుదలైన చిత్రాల సంఖ్య చూస్తే, ఎంతైనా ఆశ్చర్యం కలగక మానదు. మొత్తం 181 చిత్రాలు విడుదలయ్యాయి. వీటిలో డైరెక్ట్ టెక్ చిత్రాలు 118, డబ్బింగ్ చిత్రాలు 63. మన భారతీయ సినిమారంగ చరిత్రలో మున్నెన్నడూ కనీవినీ ఎరుగని విధంగా ఒకఏడు ఒకభాషలో ఇంతపెద్ద సంఖ్యలో చిత్రాలు విడుదలవడం రికార్డే! ముఖ్యంగా సెప్టెంబర్, అక్టోబర్‌లలో నెలకు 20 చిత్రాలు చొప్పున విడుదలయ్యాయి.

సూపర్‌హిట్ అయిన ఒకే ఒక చిత్రం "ప్రతిఘటన". హిట్ అయిన చిత్రాలు రెండు. 1. మయూరి 2. మా పల్లెలో గోపాలుడు. ఇవి చిన్న బడ్జెట్ చిత్రాలవడం పేర్కొనదగిన అంశం. విజయవంతమైనచిత్రాలు 13. "భార్యాభర్తలబంధం, జాకీ, ఊరికి సోగ్గాడు, ముగ్గురుమిత్రులు, మహరాజు, ఓ తండ్రితీర్పు, రక్తసింధూరం, అడవిదొంగ, వందేమాతరం, టెర్రర్, అన్వేషణ, అమెరికా అల్లుడు, పల్నాటి సింహం.

స్లాబ్ పద్ధతి వల్ల వినోదపు పన్ను రూపేణా రాబడి దాదాపు 30 కోట్లకు

> మద్రాసు
> సినీ విలేఖరి

పెరిగింది. ఐతే, ఒక సినిమాకళాకారుడు రాష్ట్ర ముఖ్యమంత్రి అయివుండీ కూడా మన రాష్ట్రంలో చలనచిత్ర నిర్మాణం నిలదొక్కుకోడానికి సరైన ప్రోత్సాహం ప్రభుత్వంనుండి లభించలేదు. అసలు తెలుగు చిత్రపరిశ్రమకు, రాష్ట్ర ప్రభుత్వంతో సత్సంబంధాలు తగ్గిపోయాయని చెప్పక తప్పదు.

గుంతకల్లులో పంపిణీసంస్థలు 30 నుంచి 70కి పెరిగాయి. రాజమండ్రి, విశాఖపట్నం, గుంటూరులో కూడా పంపిణీ కార్యాలయాలు పెరిగాయి.

ఎన్.టి.ఆర్. కుమారుడు బాలకృష్ణ తర్వాత ఎ. ఎన్. ఆర్. పుత్రుడు నాగార్జున, నందమూరి త్రివిక్రమరావు కొడుకు కళ్యాణచక్రవర్తి హీరోలయ్యారు.

కొత్త సంవత్సరంలో నిర్మాత డి. రామానాయుడుపుత్రుడు వెంకటేష్, ఎం. బాలయ్య కొడుకు తులసీరాం హీరోల జాబితాలో చేరిపోయారు. నిర్మాత దగ్గుపాటి భాస్కరరావు కొడుకు కూడా హీరో అవబోతున్నాడు.

1985లో ఎక్కువ చిత్రాలలో పని చేసినవారు: డైరెక్టర్ ఎ. కోదండరామిరెడ్డి-6, హీరో చంద్రమోహన్-13 హీరోయిన్ జయసుధ-16, సంగీత దర్శకుడు చక్రవర్తి-43.

థియేటర్లసంఖ్య 2545కు పెరిగింది ఇప్పుడు కోస్తాజిల్లాలలో 1410, తెలంగాణాలో 610, రాయలసీమలో 525 థియేటర్లు ఉన్నాయి.

—కొరవ 10 పేజీలో

## తెలుగుదేశం అంత సుభిక్షంగా ఉందా?

ఆంధ్రరాష్ట్రం ఎంతో సుభిక్షంగా ఉండాలి. లేకపోతే మన భారతదేశంలో అత్యధిక చలనచిత్రాలు తెలుగుభాషలో తయారవుతాయా అని మన ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధి ఒక చోట తన ఆశ్చర్యాన్ని వెలిబుచ్చారట. రెండు చిత్రాలు విడుదలైతే నాలుగుచిత్రాలకు ప్రారంభోత్సవాలు జరుగుతున్నాయి. అసలు ప్రేక్షకులే సినిమాల పేర్లను గుర్తుపెట్టుకోలేకుండా పోతున్నారట కొన్నిచోట్ల.

### రాజీవ్ సందేహం

పెరుగుట విరుగుటకొరకే కదా? 1981లో 99, 1982 లో 90, 1983లో 107, 1984లో 118. చిత్రాలు విడుదలైతే 1985 లో 181 చిత్రాలు విడుదలయ్యాయి. ఇక ఈ ఏడు ఎన్నిచిత్రాలు విడుదలవుతాయో! ఎన్ని విడుదలయినా ప్రేక్షకులు త్రిప్పికొడ్తున్నారు. కొనుగోలుదార్లు దివాలా తీస్తున్నారు. బాగా డబ్బుచేసుకుంటున్నది స్టార్‌లు ప్రాయోజకర్లు, టెక్నీషియన్లు.

## నవ్వుల పువ్వులు రువ్వుతూంది - రెండు రెళ్ళు ఆరు

> సి. నారాయణరావు

రెండు జంటల విచిత్రప్రణయం, పరిణయం ప్రాతిపదికగా తీసుకొని, ప్రేమకు హాస్యం జోడించి, హాస్యప్రియులకు నవ్వులజల్లులతో అభిషేకం గావించిన వినూత్న కథ, కథన చిత్రం మల్లాది, జంధ్యాల కలసి రూపొందించిన 'రెండు రెళ్లు ఆరు'. ఈ సినిమా పేరుతో గణితాన్ని తారుమారు చేసినట్లు, తెలుగు సినిమా రూపు'రేఖా'గణితాన్ని మార్చారంటే అతిశయోక్తి కాబోదు! మిత్రోత్సాహంతో బాపు-రమణలు, నాగిరెడ్డి-చక్రపాణిలు సాధించిన విజయపరంపరల వారసత్వమే మన జంధ్యాల, మల్లాదిల కలయిక అంటేగాని అతికినట్లుండదు.

హాస్యాన్ని వెకిలిచేష్టలతో వెర్రితలలు వేయనీయకుండా, నాణ్యమైన విశిష్ట తయారీకథను రసాత్మకాలైన సన్నివేశాల్లో నింపి, విభిన్నపాత్రలనుసృష్టించి, ఆ పాత్రల్ని ప్రత్యేకంగా తీర్చిదిద్ది రెండుగంటలపాటు ప్రేక్షకుల్ని మైమరపింపజేసిన 'మ-జ' (మజా) లకు అభినందనావందనం!

ఆ శేషదాన్ని వివిధభాషల్లో ఉచ్చరించే 'తికమక' పాత్ర, 'పిత' అని పెద్దగా అరుస్తూ ఏదోసందేశాన్ని పైనుండి అందుకున్నట్లుగా కాయకల్ప చికిత్సచేసే స్వాములవారు, ఇంట్లో వంట తానేచేస్తూ దానిని అగుపించనీయకుండా మాటిమాటికీ తన భార్యచేతి పదార్థాలరుచి మెచ్చుకునే ఐరావతం, ప్రతిమాటను మైకులాగా స్వరం పెంచి మాట్లాడే దత్తాత్రేయులు పాత్రలు విలక్షణంగావుండి అందర్నీ ఆకట్టుకున్నాయి. అయితే కీచుగొంతు వేషం ఎవ్వెట్టుతనాన్ని పాదుకొల్పింది.

ఆ వీధి భిక్షగాడిద్వారా ఐరావతం వంట రుచిఎరిగిన అప్పడాల కంపెనీ యజమాని, అతన్నే తన అప్పడాల కంపెనీ ప్రకటనకు 'మోడల్'గా అభ్యర్థించే వైపరీత్యం, ఐరావతం భార్య లలిత సంగీతసాధన ప్రహసనం, చైనా రెస్టారెంటులో దొరికే పదార్థాల్ని తెక.

—కొరవ 10వ పేజీలో



'చెడీ తేమ్సుబాండ్' లో కపిల్‌దేవ్, అనూరాధ

# 'ఎలక్ట్రానిక్స్ విప్లవ ఫలితాలు గ్రామాలకు చేరితేనే సార్థకత'

పాం ఫ్యాక్స్ అసోసియేషన్ సభ్యులు. వివరాలు కావాలంటే, కార్యదర్శి, కేరాఫ్ సారథిస్టూడియో, వి ఆర్ సి గ్రౌండ్స్ ఎదురుగా, బ్రుందావనం, నెల్లూరు అన్న చిరునామాకు రాయండి.

### కరాటే శిక్షణ

హైస్కూలు విద్యార్థులకు వచ్చేవిద్యా సంవత్సరం నుంచి కరాటేలో శిక్షణ నివ్వడానికి జిల్లా కరాటేసంఘంసంకల్పించిందట. వివరాలు కావాలంటే వి. దేవానంద్, అధ్యక్షుడు, జవహర్‌లాల్‌నెహ్రూ రోడ్, నెల్లూరు చిరునామాకు రాయండి! ఫిబ్రవరి 9 నుండి వీరు నెలరోజులపాటు వ్యాపారస్తులు, ఉద్యోగస్తులకు కూడా శిక్షణనిస్తారట.

### జయసుధ అకాడమి

జయసుధ సాంస్కృతిక అకాడమి ఆటపాట నృత్య, పాటలపోటీలుజరిపింది. డి. పి. ఆర్. ఒ. శ్రీ వై. వి. రత్నం బహుమతులు పంచారు. శ్రీ హజరత్ బాబు అధ్యక్షించారు. శ్రీ నురభి నరసింహం, శ్రీ వి. మధుసూదన మాట్లాడారు; శ్రీ ఎ. సుధాకర్ వందనాలు

## నెల్లూరు సంగతులు

(4వ పేజీ కొరవ))

చెప్పారు. శ్రీ కోట సుబ్రహ్మణ్యశాస్త్రిని సభలో సన్మానించారు.

### నెరసం

నెల్లూరుజిల్లా రచయితల సంఘం పేరుతో కొత్తసంస్థ ఒకటి వెలిసింది. గౌరవాధ్యక్షుడుగా శ్రీ ముల్లెమాల సుందర రామరెడ్డి, అధ్యక్షుడుగా శ్రీ మోనా, ప్రధాన కార్యదర్శిగా విష్ణుశ్రీ, సహాయ కార్యదర్శులుగా జయంపు కృష్ణ, టి. వీరబ్రహ్మచారి, కోశాధికారిగా శ్రీ వీరం రెడ్డి ఉమామహేశ్వరరెడ్డి ఎన్నికైనారు. అంతకు క్రితం జరిగిన సమావేశానికి ఇండియన్ బ్యాంక్ మేనేజర్ శ్రీ ఎస్. ఎస్. శర్మ అధ్యక్షించారు.

### టి. వి. ఫ్యాక్టరీ

నెల్లూరులో ఒక పెద్ద ఎలక్ట్రానిక్స్ పరిశ్రమ ప్రారంభం కానున్నది. న్యూఢిల్లీలోని ఎలక్ట్రానిక్స్ కమీషన్‌లో పాతికేళ్లకు పైగా శాస్త్రవేత్తగా పనిచేసిన శ్రీ పి. భాస్కరరెడ్డి తమ స్వగ్రామమైన కనుపర్తిపాడులో ఎలక్ట్రానిక్ పరిశ్రమనొకదానిని నెలకొల్పుతున్నారు. కోటి 50 లక్షల పెట్టుబడి అంచనాతో రూపుదిద్దుకోనున్న ఈ పరిశ్రమకు, 19 తేదీ ఉదయం 9 గంటలకు కేంద్ర ఎలక్ట్రానిక్స్ కమీషన్ సభ్యుడు శ్రీ అబిద్‌హుసేన్ శంకుస్థాపించారు; ఫ్యాక్టరీపేరు-సర్క్యూట్ మైక్రో ఎలక్ట్రానిక్స్ ప్రైవేట్ లిమిటెడ్.

భాస్కరరెడ్డి వంటి టెక్నొక్రాట్స్, ఎలక్ట్రానిక్స్ పరిశ్రమలను గ్రామాలకు తీసుకుని రావలసిన అవసరం ఎంతైనా వుందని, ఈ రంగంలో అనునిత్యం సంభవిస్తున్న విప్లవాత్మక అభివృద్ధి ఫలితాలు గ్రామాలకు ఉపయోగపడినప్పుడే, వాటికి సార్థకత లభిస్తుందని శ్రీ హుసేన్ అన్నారు.

ఎమ్మెల్యే శ్రీ కె. వి. సుబ్బారెడ్డి, సర్పంచ్ శ్రీ వి. వి. రమణారెడ్డి ప్రసంగించారు. శ్రీ భాస్కరరెడ్డి స్వాగతవందనాలు తెలిపారు. ఈ పరిశ్రమలో సంవత్సరానికి 30 వేల టెలివిజన్లు, 3 కోట్ల విలువైన మినీ కంప్యూటర్లు తయారుచేయడానికి కేంద్ర ప్రభుత్వం లైసెన్సు ఇచ్చిందట. 'ప్రియాంక' పేరుతో టి. వి. ల ఉత్పత్తి ప్రయోగాత్మకంగా ఇప్పటికే ప్రారంభించారు. కంప్యూటర్లు మరొక ఆరు నెలలలో ఉత్పత్తిచేస్తారు. వీటికి ఒక బ్రిటీషు కంపెనీ సాంకేతిక సహకారంవుంటుంది.

ఉగాదినాటికి ఫ్యాక్టరీ నిర్మాణం పూర్తిచేయాలని లక్ష్యమట.

### నెఫ్జా పోటీలు

నెఫ్జా 22 వార్షికోత్సవం మార్చిలో జరుగుతుందట. నాటక, నాటిక, ఏకపాత్రాభినయ పోటీలు జరుగుతాయి. వివరాలకు నెఫ్జా, నియర్ అనితాహాల్, నెల్లూరు - 3 చిరునామాకు రాయండి.

### బాలకృష్ణ అభిమానులు

బాలకృష్ణకు ఇంకొక అభిమానసంఘం ఏర్పడింది నెల్లూరులో. పేరు- న్యాచురల్ బ్యూటీ కింగ్ బాలకృష్ణ ఫ్యాన్స్ అట. దీనికి క్రిందివారితో కార్యవర్గం ఏర్పడింది. గౌరవ అధ్యక్షుడు, వి. సుధాకర్; కరస్పాండెంట్ ఎ. నాగరాజ, అధ్యక్షుడు, వి. వెంకటేశ్వర్లు, ఉపాధ్యక్షుడు పి. శ్రీహరి, కార్యదర్శి పి. కుమార్, సహాయ కార్యదర్శి పి. శ్రీనివాసులు; కోశాధికారి ఎల్. శ్రీనివాసులు; ఆర్గనైజర్, ఆర్. నాగేశ్వరరావు. ★





## వేపకొమ్మ న్యూస్ పొయిట్రి

### జిల్లాపరిషత్

బాలచెన్నయ్య
చెయ్యిజారింది
జిల్లాపరిషత్తు
అదే తెలుగుదేశం
రాజకీయాల్లో
ఉన్న గమ్మత్తు
ఇంకెంతమంది
పదవులకు రానున్నదో
ఈజిల్లాలో విపత్తు
అనల్పంగా
ముసలం పుట్టిందా
అంతా హజామత్తు!!

### స్వామియే శరణం!!

అయ్యప్పస్వామి భక్తి
అంతకంతకూ పెరుగుతున్నది
కష్టించి పనిచేసేశక్తి
క్రమక్రమంగా తరుగుతున్నది;
కోరికలతో
కొండనెక్కువారు
ప్రయాణంలో
మరణంపాలయ్యేవారు
ఈగుంపులయాత్రకు ఏమిటికారణం?
అందరికీ
స్వామియే శరణం!!

### కూరగాయల మార్కెట్!!

పతుకులవారివీధి
కూరగాయల
బజారు చేరాలంటే
అన్నీ అవకోధాలే!
ఎదురెదురుగా
వచ్చి ఢీకొనే రిక్షాలు
అంత యిరుకుసందులో
అన్నీ అంగళ్ళే
కట్టలు బుట్టలు
పండ్లగుట్టలు
పౌరపరాలంటే పరమ్మఛ్యూహం!
పరిష్కారమెప్పటికో
అనూహ్యం!!

—జి. ఆర్. వేపకొమ్మ.

## పంటభీమా

(4వ పేజీ కొరవ)

అన్యాయమై పోతుంది.

ఆత్మకూరు, ఉదయగిరివంటి తాలూకాలలో కొన్నిప్రాంతాలకే నష్టం. ఇప్పుడు వాటిని లెక్కలోకి తీసుకుంటే అందరికీ మేలుజరుగుతుంది. అది ప్రభుత్వానికి అనవసరమైన వ్యయమైనా, రైతుకు ఇప్పటివరకు జరిగిన అన్యాయాలతో పరిశీలిస్తే, తెప్పకోదగిందికాదు.

నష్టపరిహారం ఎంతమేరకు వుంటుందన్న విషయం తెలియడంలేదు; అది ఏరూపంలో ఇస్తారోకూడా తెలియదు. పరిహారం ఎంతవున్నా, ఏమార్గంలో యిచ్చినా, ముందు బ్యాంకు బాకీలు తీర్చవలసి వుంటుందన్నది ఖాయం. ఇప్పటి పరిస్థితులలో సర్వం కోల్పోయిన మొలగొలుకు రైతు, మొత్తం అప్పువడ్డీతో సహా రద్దయితే సంతోషపడ్తాడు. అయితే అంతసాయం జరిగే అవకాశం కన్పించడంలేదు.

భీమా పరిహారం విషయంలో తీసుకోదగిన సత్వర చర్యల విషయమై కలెక్టర్ శ్రీ జన్నత్ హుసేన్ చురుకుగా వ్యవహరిస్తున్నారు. జాయింట్ కలెక్టర్ శ్రీ దయాచారి ఈ విషయమై చర్చించడానికి బ్యాంకర్లు, అనధికారులతో రెండు ప్రత్యేక సమావేశాలుకూడా నిర్వహించారు. హైదరాబాదు నుంచి బ్యూరో ఆఫ్ ఎకనమిక్స్ అండ్ స్టాటిస్టిక్స్ సంస్థఎన్యూమరేటర్లు ఈవారాంతంలోగా నెల్లూరు రాగలరని భావిస్తున్నారు. వారువస్తే, వ్యవసాయ, రెవిన్యూ ఉద్యోగుల సహకారంతో నష్టం మదింపు కార్యక్రమం మొదలవుతుంది.

ఈలోగా రైతులు కోతలు కోసుకుని, నూర్పిడులు చేసుకోవచ్చా, లేక ఎన్యూమరేటర్లు వచ్చేనంతవరకు ఎదురుచూడాలా అనేది ఒక ప్రశ్న. జనరల్ ఇన్సూరెన్స్ డివిజనల్ మేనేజర్ శ్రీ తులసీరామరెడ్డి చెప్పడం- రైతులు తమ పాటికి తమ పనులు చేసుకోవచ్చునట: ఎవరికోసమూ ఎదురుచూడఖ్ఖ్లేదట.

భీమా పరిహారం చెల్లించవలసింది ఈ కంపెనీయే! ఈ ఇన్సూరెన్స్ కంపెనీ, రాష్ట్ర ప్రభుత్వం చెరిసగం ప్రీమియం పంచుకుని, చెరిసగం పరిహారం చెల్లించవలసి వుంటుంది.

మొత్తంమీద భీమా పథకం, ఈ సంవత్సరం రైతులకు గ్రుడ్డిలో మెల్లగా ఉపయోగ పడబోతుంది. అయితే అధికారులు, నిబంధనల విషయంలో కొంచెం సరళంగా వుండవలసిన ఆవశ్యకత ఎంతైనా వుంది. ఎంపికచేసిన శ్యాంపిల్స్ రైతులకు అనుకూలంగావుంటే సరే - లేని పక్షంలో హైదరాబాదు ఎన్యూమరేటర్లకు వాస్తవిక పరిస్థితులు బోధపరచి, రైతుల కడగండ్లు విప్పిచెప్పి సాయం జరిగేట్లు చూడాలి. నష్టం కంటే ఎక్కువ సాయం రైతుకు జరిగితే, అందువల్ల ప్రభుత్వం కోల్పోయేదేదీ వుండదు; దళార్ల తరబడి ప్రభుత్వ నిర్లక్ష్యానికి బలైనఅనాథజీవిరైతు: వాడికి ఎంతచేసినా కొంచమే రావలసినంత దానికంటే ఒక్క రూపాయి తక్కువ పరిహారంవచ్చినా, రైతుకు తీరనిద్రోహం జరిగినట్లే లెక్క. అధికారులు ఇది గుర్తుంచుకోవాలి.

## జనవాణి

(3వ పేజీ కొరవ)

చూచేవారికి ఇదొక కొత్త సినిమా పాత్ర వలె వుంది.

లేబూరు -చిత్తనూరు సునీతకుమారి

### గోగులపల్లి రోడ్డు వంకర తీయండి!

అల్లూరునుంచి గోగులపల్లెకు వెళ్లేరోడ్డు చాలా ఇరుకుగా, పలు వంకర్లు తిరిగి వుంది. నిత్యం ఉప్పులారీలు, బస్సులు కామందాడిగా తిరిగే రోడ్డు ఇది. మలుపులు ఎక్కువైనందువల్ల, ఎదురుగా వచ్చే వాహనం కన్పించక ప్రమాదాలు జరిగే అవకాశాలు హెచ్చుగా వున్నాయి. ఈ రోడ్డును మరికొంచెం వెడల్పుచేసి, వంకరలు తీస్తే, ప్రయాణం సులువుగా వుంటుంది.

అల్లూరు -ఎల్. లలిత్‌రెడ్డి

### ఆర్ ఎం పి లకు అన్యాయం

55 సంవత్సరాలకు రిటైరైన ఉద్యోగులకు, మూడేళ్ళ జీతాలు ముట్టచెప్పాలని సుప్రీం కోర్టు ఇచ్చినతీర్పు రూరల్ మెడికల్ ప్రాక్టీషనర్లకు వర్తింపచేయకుండా సతాయిస్తున్నారు అధికారులు ఆర్ ఎం.పి.లు ప్రభుత్వ ఉద్యోగులు కారట-వారికి టైంస్కేళ్ళు లేవట-అందువల్ల జీతాలు యివ్వరట.

అందరు ఉద్యోగులవలెనే ఆర్. ఎం. పి. లకు సర్వీసు నిబంధనలు, సెలవులు వర్తింపచేసి, అందరితోపాటు 55 ఏళ్లకే ఇళ్ళకు పంపించి, ఇప్పుడు మిగసలు ప్రభుత్వోద్యోగులకే వాదుపొమ్మనడం అన్యాయం, అక్రమం.

ప్రభుత్వం ఈ విషయంలో పునరాలోచనజరిపి, రిటైరైన డాక్టర్లకు న్యాయం చేయాలి.

నెల్లూరు -డాక్టర్ జె. శ్రీరాములు. కార్యదర్శి, ఆం.ప్ర.పం. రా. రిటైర్డ్ గ్రామీణ దేశీయ వైద్యసిబ్బందిసంఘం






**జమీన్‌రైతు చందా**

| | |
|---|---|
| సంవత్సర చందా | 50.00 |
| ఆరునెలలకు | 26.00 |

విడిప్రతి: ఒక రూపాయి

## శివశంకర్

(మొదటి పేజి కొరవ)

పి. సి. సి. అధ్యక్షుడి అనుమతిలేకుండా మాటమాత్రమైనా చెప్పకుండా రాయలసీమ అధ్యక్షుడిని నియమిస్తుండగా, తెలంగాణా రెడ్లందరు ప్రతిపక్షనాయకుడు శ్రీ జానారెడ్డి నాయకత్వంలో రాజకీయాలలో ఘోరంగా దెబ్బతిన్న తమ మాజీ నాయకుడు డాక్టర్ చెన్నారెడ్డిని పార్టీలోకి తిరిగి తీసుకొనివచ్చి వెంగళరావును ఎదుర్కోవాలని ప్రయత్నాలు చేస్తున్నారు. ఈమధ్య ప్రధాని రాజీవ్‌గాంధీ హైదరాబాదుకు వచ్చినప్పుడల్లా చెన్నారెడ్డి ఆయనకు స్వాగతం చెప్పటానికి విమానాశ్రయానికి హాజరవుతున్నారు. అయినప్పటికీ ఆయనను పార్టీలోకి తీసుకోవడం అంత సులభంకాదని పి. సి. సి. ప్రధాన కార్యదర్శి ఒకరు చెప్పారు. రెడ్లు ఇంత చేస్తున్నప్పటికీ వెంగళరావు వారితో సర్దుకొనిపోవడానికే ప్రయత్నిస్తున్నారని జిల్లా కాంగ్రెస్ అధ్యక్షపదవులన్నీ ఒకటిరెండుతప్పిస్తే, ఆంధ్రతెలంగాణాలలో, రాయలసీమలలో రెడ్లకే ఇచ్చారని, పి. సి. సి. వర్గాలవారు చెప్పారు. రాయలసీమ ఉద్యమంలో అనుమతిలేకుండా పాల్గొంటూ పార్టీకి చెడ్డపేరు తెస్తున్నందుకు రాజశేఖరరెడ్డిమీద చర్యతీసుకోవాలని ఎంతోమంది ఒత్తిడి చేస్తున్నప్పటికీ వెంగళరావు ఇంకా వేచి చూద్దాం అని అంటున్నట్లు తెలిసింది. పార్టీ నాయకులతో కార్యకర్తలతో వెంగళరావు ఇంకా ఎమర్జెన్సీ ముఖ్యమంత్రి కాలంనాటి ధోరణిలోనే వ్యవహరిస్తున్నారని చాలామంది ఫిర్యాదు చేస్తున్నారు. వెంగళరావు నియమించిన పి. సి. సి కార్యవర్గంలో ఒకప్పుడు ఆయనతోపాటు శ్రీమతి గాంధీని ఎదిరించి, ఆయనను అనుసరించినవారే ఎక్కువమంది వున్నారని. వీరిలో కొందరు లోపాయికారీగా తెలుగుదేశంతో సంబంధాలు పెట్టుకొని పార్టీని నమ్మిస్తున్నవారుకూడా వున్నారని, వెంగళరావుకు ఒకప్పుడు అత్యంత సన్నిహితుడుగా వుండి పార్లమెంటు ఎన్నికలలో ఆయన తరపున ప్రచారం చేసిన కాంగ్రెస్‌ప్రముఖుడొకరు చెప్పారు. ఇటువంటివారిని పెట్టుకొని వెంగళరావు కాంగ్రెస్‌పార్టీని ఎట్లా ఉద్ధరిస్తాడని సుమారు 15 ఏళ్ళపాటు పార్లమెంటు సభ్యుడుగా పనిచేసిన ఆ ప్రముఖుడు ఈ విలేఖరితో ప్రశ్నించారు. వెంగళరావు కొన్ని పొరపాట్లు చేస్తున్నప్పటికీ ఈ ఏడాదికాలంలో రాష్ట్రమంతటా సుడిగాలిలా తిరిగి కాంగ్రెసుకు కొత్తఊపు తెచ్చారన్న విషయాన్ని చాలామంది అంగీకరిస్తున్నారు. తెలుగుదేశంపార్టీని ఎదుర్కోవాలంటే కాంగ్రెస్‌కు మిగిలిన ఏకైకనాయకుడు ఆయనేనని మరే కాంగ్రెస్ నాయకులకు ఆ సమర్థత లేదనే విషయం లోగడే రుజువైపోయిందని వారు అంటున్నారు; కాని వెంగళరావు తన వ్యవహారశైలిని మార్చుకోకపోతే ఇదివరకేవున్న వ్యతిరేకులకు తోడుగా కొత్తగా మరికొందరు ఆయనకు వ్యతిరేకులుగామారే అవకాశం కనిపిస్తున్నది. ★

## నామాట

(2వ పేజీ కొరవ)

మైపాడు. ఆదేమిఖర్మమో ఆమైపాడులో 'బీచ్' పాతైపోతూంది.

బీచ్ అనేపదానికి నిఘంటు అర్థం తీరమనే అయినా, వాడుకలో విహారానికి అనువైన చెలియలికట్టకిందనే లెక్క. సముద్రం అన్నిచోట్ల ఒకరకంగా వుండదు. కొన్నిప్రాంతాలలో ఉగ్రరూపం, మరికొన్ని ప్రాంతాల్లో శాంతస్వరూపం దాల్చివుంటుంది. అలలో వేగంతక్కువై, అల్లనల్లన నడచివచ్చి ఇసుకతిన్నెపై పాదాలు స్పృశించి వెళ్ళే తీరాన్నే బీచ్‌గా పిలుస్తుంటాం మనం. సముద్రుడి క్రౌర్యాన్నించి రక్షణ వెదుక్కునే, విహరిస్తాం. మద్రాసు మెరీనావలె, గోవాలోవలె మైపాడులో సముద్రుడు ఒకప్పుడు శాంతంగావుండేవాడు.

కాని ఇప్పుడు మైపాడులో పరిస్థితి తద్భిన్నంగావుంది. పి డబ్ల్యు డి గెస్ట్ హౌస్ ఎదురుగా వుండే ఇసుక తిప్పలకు, అలలు తాకే చోటుకు ఇదివరకు 150, 200 మీటర్లదూరం వుండేది; వరుసగా వచ్చిపడిన తుఫాన్ల ఫలితమేమో ప్రస్తుతం అలలు ఇసుక తిప్పను తాకుతున్నాయి. పైగా కత్తిపెట్టి నరికినట్లు తీరం తెగివుంది; అలలు అంతమయ్యే చోటే, లోతు మోకాలును దాటుతుంది. మధ్యమధ్యలో ఎన్నో గుంటలు, వాటిలోతు దిగిందాకా తెలియడంలేదు.

అన్నిటికీ మించి అలతాకిడి ఉధృతంగావుంది, మహోద్రేకంగా విరుచుకపడుతున్నాయి. ఒక్కొక్క తరంగం వచ్చిపోతుంటే, ఇసుకతో సహా మళ్ళీ తిరిగి సముద్రంలోకి జారుతున్నాయి పాదాలు. అడుగుదూరం పోవాలన్నా బిక్కుబిక్కుమంటూంది ప్రాణం.

సముద్రంలోని వాయుగుండాల ఫలితంగా సంభవించిన అనర్థమే ఇది. ఈ ఇసుకకోతను అరికట్టకుంటే, మరికొంతకాలానికి మైపాడు బీచ్ అత్యంతప్రమాదకరంగా మారినా ఆశ్చర్యంలేదు.

జిల్లాకు మిగిలిన ఏకైక పిక్నిక్‌స్పాట్ కళ్ళముందే పాడైపోతుంటే చూస్తూవూరుకోవడం ధర్మంకాదు. సముద్రంగురించి తెలిసిన ఓషియనాలజిస్టులనుకాని, టూరిజం నిపుణులనుకాని సంప్రదించి బీచ్ సౌందర్యాన్ని రక్షించుకోవలసినబాధ్యత అధికారులపైనవుంది, అది ఎంత వెంటనే జరిగితే అంతమేలు. ★

### జమీన్‌రైతు చందా

| | |
|---|---|
| సంవత్సరం చందా | రు. 50.00 |
| ఆరు నెలలకు | 26.00 |

# నెల్లూరు జిల్లాపరిషత్ ఉద్యోగ ప్రకటన

(8వ పేజి కొరవ)

| | |
|---|---|
| | from the prescribed percentage of marks in case of SCs., & S Ts. |
| For Category 5 (Secondary Grade Teachers) | i) S S L C or Intermediate and<br>ii) A trained teachers Certificate of the Secondary Grade or the Senior Basic Grade or an Equivalent thereto or Matric trained Teachers Certificate. |
| For Category-6 (P. E. T. Grade-I) | i) Government Teachers Certificate in Physical Education (Higher Grade) or a Government Teacher's Certificate in Physical Education (Higher Grade) issued to Ex-servicemen or a Diploma or a certificate in Physical Education issued to Intermediate candidates by the Government College of Physical Education, Hyderabad. |
| For Category-7 (P E T Grade-II | i) A Government Teachers Certificate in Physical Education (Higher Grade) or a Government Teacher's Certificate in Physical Education (Higher Grade) issued to Ex:servicemen or a Diploma or a Certificate in Physical Education issued to Intermediate candidates by the Government College of Physical Education, Hyderabad and<br>ii) A person passing the Government Teachers Certificate in Lower Grade and these cases will be considered when the person of No (i) are not available. |
| For Category-8 (Hindi Pandit Grade-II) | Pracharak Diploma of tbe Hindi Prachara Sabha or any equivalent there to as may be prescribed by the State Government (or)<br>i) Oriental title with Pandits training<br>ii) Oriental title without Pandits training<br>iii) Preliminary examination of Oriental title.<br>iv) Entrance Examination of Oriental title. |
| Age prescribed: (for all categories 1 to 10) | 18 years above and below 36 years as on 1-7-1985 (Five years raised uniformly to the candidates belong toS. Cs., S. Ts., & B. Cs.) |
| FEES :- (For all Categories from 1 to 10) | A sum of Rs. 10/- should be remitted to "Nellore Zilla Parishad General Funds" in any sub Treasury in the District and the original chalan should be enclosed to the application (S.Cs., S.Ts. B.Cs. & physically hadicapped candidates are exempted from Payment of fees, if they attach a copy of the caste certificate issued by the Mandal Revenue Officer). |
| Last date prescribed for receipt of Application | Applications should reach Zilla Parisaad Office, Nellore on or before 10-2-1986 by 5-30 p. m. |

11. ఇతర వివరములు:

పై వివరములన్నియు నిజమని రూఢిపరచుచున్నాను.
దరఖాస్తుదారుని సంతకము.

**సూచనలు:**

1. దరఖాస్తు తెల్ల కాగితముమీద వ్రాసి భర్తీ చేసి పంపవలెను.
2. దరఖాస్తులో ఈ క్రింద వివరించినవి జతపరచి పంపవలయును.
   అ. విద్యార్హత మరియు మార్కుల సర్టిఫికేటు నకలు.
   ఆ. వయస్సు ధృవీకరించు సర్టిఫికేటు నకలు.
   ఇ. కుల ధృవీకరణ పత్రము యస్. సి., ఎస్. టి. మరియు బి. సి. లకు మాత్రమే.
   ఈ. దరఖాస్తుమీద అంటించిన ఫోటో కాకుండా అదనముగా రెండు పాసుపోర్టు సైజు ఫోటోలు.
   ఉ. చిరునామా వ్రాసి 0.50 పైసలు పోస్టలు స్టాంపులు అతికించిన 2 ఖాళీ కవర్లు 9"×4"
   ఊ. రుసుము రూ. 10 లు చెల్లించిన ఒరిజినల్ ఛలాను.
3. స్పెషల్ టీచరు (కన్‌సాలిడేటెడ్ పే) ఉద్యోగమునకు దరఖాస్తుచేయుచున్న వారు దరఖాస్తు పైభాగములో ట్రైనింగ్ పొందినవారు "స్పెషల్ టీచర్ (ట్రైయిన్డు)"అనియు ట్రైయినింగు పొందనివారు "స్పెషల్ టీచరు (అన్ ట్రైయిన్డు)" అని వ్రాయవలెను.
4. అర్హత కలిగినవారికి మాత్రము లిఖిత పరీక్ష తేది 16-2-86 ఆదివారము మధ్యాహ్నం 2 గంటలకు జరుపబడును.
   వ్రాత పరీక్షకు హాలు టికెట్టు 15-2-86 తేదిన ఉ. 10 గంటలు మొదలు సా. 5 గంటలలోగా జిల్లాపరిషత్ కార్యాలయమునందు అభ్యర్థులు స్వయముగా తీసుకొనవలెను.
5. లిఖిత పరీక్షయందు కృతార్థులైన వారికి మౌలిక పరీక్షలకు ఇంటర్వ్యూ కార్డులు పంపబడును.
6. పూర్తిచేసిన దరఖాస్తులు పంపు కవరుపై, దరఖాస్తు ఏ ఉద్యోగమునకు పంపబడుచున్నదో వ్రాసి ఈ క్రింది అడ్రసుకు నిర్ణీత గడువులో అనగా 10-2-86 తేది సాయంకాలం 5-30 గంటలలోపల పంపవలయును.

జిల్లా అభివృద్ధి అధికారి,
జిల్లా పరిషత్ కార్యాలయము,
నెల్లూరు-524 003
నెల్లూరు జిల్లా

జన్నత్ హుసేన్ ఐ.ఎ.ఎస్.
జిల్లా కలెక్టర్ మరియు అధ్యక్షులు
ఎంపిక సంఘము-నెల్లూరు.

సంపాదకుడు, ముద్రాపకుడు, ప్రకాశకుడు డాక్టరు శ్రీరామమూర్తి, జమీన్‌రైతు ప్రెస్. 17/170. తిప్పరాజువారి వీధి, నెల్లూరు-524001